# చందమామ

ఈ సంచికలో కథలు

వింతలు - విశేషాలు

★



ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.



కోడూరి కౌసల్యాదేవి ప్రసిద్ధ నవల 'చక్రభ్రమణం' ద్వారా
యావదాంధ్ర పాఠకలోకానికీ అత్యంతాభిమాన పాత్రాలయిన పాత్రలు


చక్రవర్తి


మాధవి


రవీంద్ర


నిర్మల


శ్రీదేవి


శ్రీధర్

యావదాంధ్ర ప్రేక్షక లోకానికీ అత్యంతాభిమాన పాత్రులైన పాత్రధారులు

ఆంధ్రుల అభిమాన సంస్థ



అన్నపూర్ణా వారి

# డాక్టర్ చక్రవర్తి

నిర్మాత డి. మధుసూదనరావు B.A. ✻ దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు



సంగీతం- ఎస్. రాజేశ్వరరావు

నిర్మాణం శ్రీ సారథీ స్టూడియోస్. హైదరాబాద్ — నవయుగ విడుదల

హార్లిక్స్ చేసే మంచికి ఒక ఉదాహరణ:

# మా కాపురం పాడయేది

అలసటతో, నిరుత్సాహముతో,
బాధపడుతున్నా నేమో సంసారములో
సుఖమేమిటని మెట్ట వేదాంతములో పడి
సంతోషాన్ని పోగొట్టుకొన్నాను






అదృష్టవశాత్తు, ఒక రోజున మేము డాక్టరు దగ్గరకు వెళ్ళేము. శ్రమ మరియు వ్యాకులత శక్తి క్షీణతకు చిహ్నములని ఆయన చెప్పేరు. నేను ప్రతి రోజూ హార్లిక్స్ త్రాగుతే మళ్ళీ ఆరోగ్యమును, ఉత్సాహమును పొందగలనని ఆయన అన్నారు.



నేను హార్లిక్స్ త్రాగటము ప్రారంభించేను. అది చిటుకలా పనిచేసింది. కొన్ని రోజులలోనే నేను శక్తి ఉత్సాహములను పొందేను. ఇప్పుడు నాకు చురుకుగా ఉండుటలోని రహస్యము తెలుసును కనుక నేనింక మళ్ళీ నిరుత్సాహమును దగ్గరకు రానీయను!




## హార్లిక్స్ అదనపు శక్తిని కలిగించును!

ఎక్కువగా
స్కూళ్లన్నీ దీన్నే
నిర్దేశిస్తున్నాయి
యూనిఫారములకు

అందంగా ఉండి, రంగు దిగని బిన్నీవారి కేస్‌మెంట్ B 5586! అమోఘమైన మన్నిక వల్ల స్కూలు యూనిఫారములు - ట్యూనిక్‌లు, స్కర్ట్‌లు, షర్టులు, బ్లౌజులు, షార్టులు అన్నిటికీ అందరూ వాడతారు.

ఇంట వాడకానికి కూడా B 5586 ఆకర్షణీయమైన కర్టెనులు, కుషన్ కవరులు ఇంకా ఇతర ఉపయోగాలకు కూడా అనుకూలంగా ఉంటుంది.

B5586 అనేక రంగుల శ్రేణిలో లభిస్తుంది.

# బిన్నీవారి
# కేస్‌మెంట్
# B.5586




ది బెంగుళూరు వూలెన్, కాటన్ & సిల్క్ మిల్స్ కంపెనీ లిమిటెడ్ అగ్రహారం రోడ్డు, బెంగుళూరు-23 బిన్నీ & కంపెనీ లిమిటెడ్, మద్రాసువారి అంగ సంస్థ.

ఎవరెస్ట్
టైనీటాట్‌తో
పిల్లలు
ఉల్లాసంగా
వెళ్ళుతున్నారు

ఒక షోకైన చిన్న వాక్యూం ఫ్లాస్కు— స్కూలుకు వెళ్లే పిల్లలు వారి కిష్టమైన వేడి లేక చల్లటి ఆహారాన్ని, పానీయాలను తీసుకువెళ్ళటానికిగాను ప్రత్యేకంగా డిజైను చెయ్యబడ్డది. ఈ టైనీటాట్ ఎవరెస్ట్ వాక్యూం ఫ్లాస్కులకు గల అన్ని విశిష్టాంశాలను, నాణ్యమైన సామగ్రిని కలిగియుంది. మీ బిడ్డకు స్వంతానికి ఒక టైనీటాట్‌ను తెచ్చిపెట్టరా? గర్వకారణమైన ఇట్టి వస్తువులు శక్తివంతమైన వ్యక్తిత్వాన్ని పొందగలట్లు అతని దృక్పథాన్నే మార్చ తోడ్పడగలవు. "బిడ్డ మనిషికి తండ్రి" అని కదా నానుడి!




విక్టరీ ఫ్లాస్క్ కంపెని ప్రైవేట్ లిమిటెడ్,

బొంబాయి ★ కలకత్తా ★ ఢిల్లీ ★ మద్రాసు

# నూతన భారత ప్రధాని లాల్ బహాదుర్ శాస్త్రి

స్వతంత్ర భారతానికి ప్రారంభోత్సవం చేసిన ప్రధాని జవాహర్లాల్ సజీవుడై ఉండగా, "నెహ్రూ తరవాత ఎవరు?" అన్న ప్రశ్నకు సమాధానం చెప్పటానికి ఎవరికీ నోరాడింది కాదు. కాని నెహ్రూ పోయినాక లాల్‌బహాదుర్—శాస్త్రి అన్నది పెట్టు పేరు—ఏకగ్రీవంగా ఎన్నిక అయాడు.

లాల్‌బహాదుర్‌లో మొదటి మాట జవాహర్‌లాల్‌లో చివరి మాట. లాల్‌బహాదుర్ కూడా గాంధీజీలాగే అక్టోబరు 2-న జన్మించాడు. భారతదేశానికి చిర స్మరణీయులైన గాంధీ, నెహ్రూలను ఈ విధంగా జ్ఞప్తికి తెచ్చే ఈ లాల్ బహాదుర్ ఎలాటి వ్యక్తి?



లాల్‌బహాదుర్ 60 ఏళ్ళ క్రితం మొగల్‌సరాయ్‌లో జన్మించాడు. వారిది పేద కుటుంబం. 18 మాసాల శిశువుగా లాల్ బహాదుర్ తండ్రిని కోల్పోయి మాతామహుడి వద్ద పెరిగాడు.

లాల్‌బహాదుర్‌కు చిన్నతనం నుంచి లేమి అంటే ఏమిటో తెలుసును. అయన బడికి వెళ్ళేటందుకు పడవ మీద గంగ దాటటానికి అణా డబ్బులు లేక పుస్తకాలు నెత్తిన పెట్టుకుని నదికి అడ్డంగా ఈదాడట!

లాల్‌బహాదుర్ వారాణసి లోని హరిశ్చంద్ర పాఠశాలలోనూ, కాశీ విద్యాపీఠంలోనూ విద్యాభ్యాసం చేసి, పట్టభద్రుడై "శాస్త్రి" అయాడు. విద్యార్థిగా ఉండగానే అయన గాంధీజీ ప్రారంభించిన సహాయ నిరాకరణోద్యమంలో చేరాడు.

కాలక్రమాన అయనను లాలా లజపత్‌రాయ్ ఉద్యమం ఆకర్షించింది. అయన ప్రజా సేవా సమాజంలో జీవిత సభ్యత్వం పొంది, అలహాబాదులో పని సాగించటానికి వచ్చి, నెహ్రూ ప్రభావానికి గురి అయాడు. అలహాబాదు మునిసిపల్ బోర్డుకు ఎన్నిక కావటం అయనకు లభించిన మొదటి పదవి.

ఉప్పు సత్యాగ్రహంలో రెండున్నర ఏళ్ళూ, 1941 వ్యష్టి సత్యాగ్రహంలో ఒక ఏడాదీ, "క్విట్ ఇండియా" ఉద్యమంలో దాదాపు మూడేళ్ళ నిర్బంధమూ అయన అనుభవించిన శిక్షలు.

అంతకు పూర్వమే అయన కాంగ్రెసు రాజకీయాలలో బాగా పాతుకు పోయి, 1935 లో ఉత్తర ప్రదేశ కాంగ్రెసు కమిటీ ప్రధాన కార్యదర్శి అయాడు. 1946 లో ఉ. ప్ర. ముఖ్యమంత్రి పంత్‌కు పార్లమెంటరీ కార్యదర్శి అయాడు. మరుసటేడు రవాణా మంత్రి పదవి లభించింది.

అయన కేంద్ర రాజకీయరంగంలో కాలు పెట్టింది 1952 లో, రైల్వేల మంత్రిగా. ఒక రైలు ప్రమాదం కారణంగా అయన తన పదవికి రాజీనామా ఇచ్చేశాడు. 1957లో లోక్‌సభకు ఎన్నికై, వివిధశాఖలలో మంత్రిత్వం వహించాడు.

లాల్‌బహాదుర్ శాస్త్రి చాలా సౌమ్యుడు, అతిశయం లేని వాడు, శాంతిప్రియుడు. ఆగ్రహావేశులను సైతం శాంతపరచగలడు. ఓర్పు, ఇతరుల దృక్పథాన్ని గ్రహించే శక్తి గల వాడు. మంచి రచయిత. ఈయన నాయకత్వం కింద దేశం అభ్యుదయవంతం కావటానికి సందేహం లేదు.



# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

భారతదేశానికి నెహ్రూ శకం ముగిసింది. భారతీయులం దేశ నిర్మాతకు అశ్రుతర్పణాలు విడిచాం. కాని నెహ్రూ అమరజీవి. మనకు ఆయన అవసరం ఎప్పటికన్నా ఇంకా హెచ్చుగా ఉండబోతుంది. ఆయన ఆదర్శాలూ, ఆశయాలూ ధృవతారగా మనకు నిలిచి ఉంటాయి. అవి మన సంస్కృతిలో ఒక భాగంగా వుండిపోతాయి. అందుచేత ఈ సంచిక నుంచి నెహ్రూ జీవిత కథను ప్రచురిస్తున్నాం.

సంపుటి 35 జూలై 1964 సంచిక 1







# భారత చరిత్ర



రెండవ దేవరాయలు 1446లో చనిపోగా, అతని పెద్ద కొడుకు మల్లికార్జునుడు రాజై, తన రాజధాని పైకి ఏకంగా దండెత్తి వచ్చిన బహ్మనీ సుల్తానునూ, ఒరిస్సా (హిందూ) రాజునూ ప్రతిఘటించాడు. 1465 ప్రాంతం దాకా సాగిన ఇతని పరిపాలనలో విజయ నగర రాజ్యానికి ఎలాటి ప్రమాదమూ జరగ లేదు. ఇతని కాలంలోనే చంద్రగిరి రాజైన సాళువ నరసింహుడు ప్రఖ్యాతుడయాడు; ఇతని పూర్వీకులు విజయనగర రాజులకు సామంతులు.

మల్లికార్జునుడి అనంతరం వచ్చిన రెండవ విరూపాక్షుడు అసమర్థుడు. అందుచేత అతని పరిపాలనలో అరాజకస్థితి ఏర్పడింది. దాన్ని ఆధారం చేసుకుని బహ్మనీ సుల్తాను కృష్ణా తుంగభద్రల మధ్య ప్రాంతాన్ని ఆక్రమించాడు; ఒరిస్సా రాజైన రాజా పురుషోత్తమ గజపతి తిరువన్నామలై దాకా వచ్చేశాడు. కొన్ని ప్రాంతాలు తిరగబడ్డాయి.

ఈ దుస్థితిని అరికట్టటానికి సాళువ నరసింహుడు 1486 ప్రాంతంలో రాజును తొలగించి తానే సింహాసనం ఎక్కాడు. ఈవిధంగా సంగమవంశ పరిపాలన అంతమై విజయనగరంలో సాళువ వంశ పరిపాలన ఆరంభమయింది. సాళువ నరసింహుడు ప్రజాభిమానం చూరగొన్నవాడు; తాను పరిపాలించిన ఆరేళ్ళ కాలంలో తిరుగుబాటు చేసిన వారిలో చాలామందిని లోబరుచుకున్నాడు. రాయచూరు ప్రాంతం బహమనీల కిందా, ఉదయగిరి ఒరిస్సా రాజు కిందా ఉండిపోయాయి.

తుళువ దేశపు రాజుల సంతతి వాడైన నరసనాయకుడనేవాడు సాళువ నరసింహుడి సేనాపతిగా ఉండేవాడు. ఇతను అత్యంత విశ్వాసపాత్రుడైనందున, నరసిం

## 34. కృష్ణదేవరాయలు

హుడు తన అనంతరం రాజ్యభారాన్ని నరస నాయకుడి పరం చేశాడు. నరసనాయకుడు రాజ్యభారాన్ని తానే మోస్తూ కూడా సాళువ నరసింహుడి కొడుకు ఇమ్మడి నరసింహుడనే వాణ్ణి సింహాసనం మీద ఉంచి తన ప్రభువుల పట్ల విశ్వాసం చూపాడు.

అయితే నరసనాయకుడు 1505 లో చనిపోగా, అతని కొడుకు వీరనరసింహుడు సాళువవంశపు రాజును రాజ్యభ్రష్టుణ్ణి చేసి తానే సింహాసనం ఎక్కాడు. విజయనగర పరిపాలన తుళువ వంశ రాజులదయింది.

వీరనరసింహుడి అనంతరం రాజ్యానికి వచ్చిన అతని తమ్ముడు కృష్ణదేవరాయలు ఇతర విజయనగర రాజుల కన్న ఎంతో శ్రేష్ఠుడు కావటమేగాక, భారతచరిత్రకు చెందిన ప్రఖ్యాత రాజులలో ఒకడు. అతను వీరుడూ, యుద్ధ కుశలుడూ. తన జీవిత మంతా యుద్ధాలలో గడిపికూడా ఓటమి ఎరగడు. ఆయన ముందుగా తన సామ్రాజ్యం మధ్యనున్న సామంతుల తిరుగుబాటు లణచివేసి, ఉత్తరాన గల తన ప్రతి కక్షులను సాధించ బూనుకున్నాడు. 1511-12 లో దక్షిణ మైసూరులోని ఉమ్మత్తూరు నాయకుడి తిరుగుబాటు అణచబడింది. 1512 లో కృష్ణదేవరాయలు బిజాపూరు



సరిహద్దు లోపల ఉన్న రాయచూరును జయించాడు. ఆయన ముస్లిము రాజ్యాలపై దాడి చేద్దా మనుకున్నాడు గాని, ఆయన మంత్రీ, సేనానీ అయిన సాళువ తిమ్మయ్య అందుకు సమయం రాలేదని చెప్పగా మానుకున్నాడు.

1513 లో కృష్ణదేవరాయలు ఒరిస్సాలోని గజపతి ప్రతాపరుద్రుడిపై దండెత్తాడు. సంగమ వంశ పరిపాలన జరిగే కాలంలో విజయనగర రాజ్యంలోని కొన్ని ప్రాంతాలను గజపతి ప్రతాపరుద్రుడి పూర్వీకులు స్వాధీన పరుచుకున్నారు—వాటిని తిరిగి సంపాదించటానికే ఈ దాడి. 1514 ఆరం

భంలో ఉదయగిరి దుర్గం లొంగిపోయింది. ఒరిస్సా రాజుకు గోలకొండ సుల్తానూ, బీదరు సుల్తానూ సహాయం చేసినప్పటికీ ఏమీ లాభం లేకపోయింది. మరుసటి ఏడు కొండవీడు దుర్గమూ, చుట్టుపక్కల ఉండే చిల్లర దుర్గాలూ ఓడిపోయాయి. ఒరిస్సా యువరాజు వీరభద్రుడు మొదలైనవారు కృష్ణదేవరాయలకు బందీలుగా చిక్కారు. వీరభద్రుణ్ణి ఒక పరగణాకు పాలకుడుగా నియమించి కృష్ణదేవరాయలు తన రాజ నీతిజ్ఞత చూపాడు.

ఒరిస్సా పైన మూడవ దండయాత్ర చేసేటప్పుడు కృష్ణదేవరాయలు బెజవాడ (ఇప్పటి విజయవాడ)లో మకాం చేసి, కొండ పల్లి దుర్గాన్ని ముట్టడించాడు. ఒరిస్సా రాజు భార్యా, కొడుకూ (వీరభద్రుడు కాదు) ఈ సమయంలో చిక్కారు. అక్కడి నుంచి కృష్ణదేవరాయలు సింహాచలం దాకా వెళ్ళి, ఒరిస్సా రాజును కాళ్ళబేరానికి తెచ్చాడు.

కృష్ణదేవరాయలు సాధించిన చిట్టచివరి ఘనవిజయం రాయచూరు వద్ద. ఇది ఎలా జరిగిందంటే, రాయచూరును తిరిగి సంపాదించాలని ఇస్మాయిల్ ఆదిల్ షా యత్నించాడు; అతనిని కృష్ణదేవరాయలు 1520 మార్చి 19 న చిత్తుగా ఓడించాడు. ఆ సందర్భంలో బిజాపూరు రాజ్యమంతా ఆక్రమించబడిందనీ, గుల్బర్గా దుర్గం నేల మట్టమయిందనీ చెబుతారు.

కృష్ణదేవరాయలు తన విజయాలతో ఉత్తర ప్రాంతాల రాజులను అదుపులో ఉంచాడు; తన సామ్రాజ్యాన్ని పడమట దక్షిణ కొంకణం దాకానూ, తూర్పున విశాఖ పట్టణం దాకానూ, దక్షిణాన సముద్రతీరం దాకానూ విస్తరింపజేశాడు. హిందూమహా సముద్రతీర ప్రాంతాలలోనూ, దీవులలోనూ కొన్ని విజయనగరానికి లోబడి ఉండేవి. కృష్ణదేవరాయలు తన చివరి కాలాన్ని శాంతియుత పరిపాలనకు వినియోగించాడు.





# ప్రహ్లాదుడు

## 3

హిరణ్యకశిపుడి ఆనతిపై భయంకరులైన రాక్షసులు ప్రహ్లాదుణ్ణి శూలాలతో పొడిచారు. పెద్ద ఏనుగుల చేత తొక్కించారు. పాముల చేత కరిపించారు. మారణ హోమప్రయోగాలు చేశారు. కొండల మీది నుంచి తోయించారు. కృత్రిమంగా పిడుగులు కూడా మీద పడేలాగు చేశారు. ఎన్నిచేసినా, నేలలో పూడ్చి పెట్టినా, విషం పెట్టినా కూడా ప్రహ్లాదుడు చెక్కుచెదరలేదు. బ్రహ్మదేవుడు హిరణ్యకశిపుడి కిచ్చిన వరాలన్నీ ప్రహ్లాదుడికి దక్కినట్టయింది.

తన ప్రయత్నాలన్నీ వ్యర్థం కావటం చూసి హిరణ్యకశిపుడికి ఒక వింత భయం పట్టుకున్నది. కావటానికి పసివాడేగాని ప్రహ్లాదుడిలో ఏదో శక్తి ఉన్నది. వాడికి భయం కూడా లేదు. వాడితోటి పగ తన చావుకు దారి తీస్తుందా అన్న సంశయం హిరణ్యకశిపుడి మెదడులో తల ఎత్తింది. ఈ విధంగా తల వంచుకుని ఆలోచిస్తూ చింతాక్రాంతుడై హిరణ్యకశిపుడు కూర్చుని ఉండగా, చండామర్కులు అతని వద్దకు వచ్చి, "మూడు లోకాలనూ జయించిన మీ కెందుకు విచారం? చిన్నపిల్లలకు గుణదోషాలు తెలియవు. అందుచేత ప్రహ్లాదుడి బుద్ధులను గురించి విచారించ నవసరం లేదు. శుక్రాచార్యులవారు వచ్చిన అనంతరం ఆయన ప్రభావంచేత కుర్రవాడి బుద్ధి మారవచ్చు," అన్నారు.

"సరే, ప్రస్తుతానికి మీరు వాడికి రాజధర్మాలూ, గృహస్థధర్మాలూ నేర్పుతూ ఉండండి," అని హిరణ్యకశిపుడు చండామర్కులతో అన్నాడు. ఆ ప్రకారమే వారు ప్రహ్లాదుడికి పూర్వంలాగే చదువు చెప్పుతూ వచ్చారు. కాని తత్వజ్ఞానం తల కెక్కిన

అట్ట చివరి బొమ్మ

ప్రహ్లాదుడి కీ చదువు ఎంత మాత్రమూ నచ్చ లేదు. తనతో కలిసి చదువుకునే పిల్లలు తనను ఆటలకు పిలిచినప్పుడు ప్రహ్లాదుడు వారికి కూడా తత్వబోధచేసి, భగవంతు డొక్కడే సత్యమనీ, మిగిలినవన్నీ బాధలను కలిగించే భ్రమలు మాత్రమేననీ, ఈ తత్వోపదేశం నారదుడు తన తల్లికి చేయగా తాను విన్నాననీ చెప్పాడు. అతని ప్రభావంతో మిగిలిన రాక్షస బాలులు కూడా హరి ధ్యానంలో పడ్డారు. ఇది చూసి కంగారు పడి చండామర్కులు హిరణ్యకశిపుడితో ప్రహ్లాదుడు చేస్తున్న పని గురించి చెప్పారు. తన కొడుకును తానే చంపటానికి హిరణ్యకశిపుడు నిశ్చయించుకున్నాడు. అతను ప్రహ్లాదుణ్ణి పిలిపించి, చేతులు మోడ్చి వినయంగా నిలబడి ఉన్న ఆ కుర్రవాడితో, "ఓరీ నీతిమాలినవాడా! ఏం చూసుకుని నా ఆజ్ఞను ధిక్కరిస్తున్నావురా? నా ఆజ్ఞ అంటే మూడు లోకాలూ గడగడలాడతాయే!" అన్నాడు.

"మహారాజా, నీకేమిటి, నాకేమిటి? అందరికీ బలం ఆ పరమాత్ముడే. నీవు రాక్షసభావం వదిలిపెట్టి సౌమ్యుడివికా. అంతశ్శత్రువులైన కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాల నారింటినీ గెలవ కుండా లోకాలన్నిటినీ జయించానంటే ప్రయోజనమేమిటి?" అని ప్రహ్లాదుడు జవాబిచ్చాడు.



"మూఢుడా, నీది చావు తెలివిలాగుంది. నేనుగాక మరొక లోకేశ్వరుడున్నా డంటావా? వా డెక్కడ?" అని హిరణ్యకశిపు డన్నాడు. లోకేశ్వరు డంతటా ఉన్నాడని ప్రహ్లాదుడు చెప్పాడు. "అయితే ఈ స్తంభంలో కన బడడేం?" అని హిరణ్యకశిపుడు కత్తి దూసి ప్రహ్లాదుణ్ణి చంపటానికి సింహాసనం నుంచి చివాలున లేస్తూ సభా స్తంభాన్ని తన పిడికిలి బలంతో ఒక్క దెబ్బ కొట్టాడు.

వెంటనే భూమ్యాకాశాలు బద్దలయినట్టు భయంకరమైన చప్పుడయింది. అది బ్రహ్మ మొదలైన వాళ్ళు కూడా విన్నారుగాని హిరణ్యకశిపుడు చెవిన పెట్టలేదు. కొడు కును ఎలా చంపటమా అని తటపటా యిస్తూ అతను అటూ ఇటూ తిరిగాడు.

అంతలోనే అతనికి స్తంభంలో నుంచి పుట్టిన భయంకరమైన వింత ఆకారం కన బడింది. అది మృగమూ కాదు, మనిషీ కాదు. దానికి భయంకరమైన కోరలూ, కత్తి లాటి నాలుకా ఉన్నాయి. పసుపు పచ్చని రంగుతో కళ్ళు క్రూరంగా మెరుస్తున్నాయి. మెడ కురుచగానూ, బాగా కొవ్వీ ఉన్నది. శరీరం నిండా తెల్లని రోమాలున్నాయి. ఆయుధాలలాటి గోళ్ళున్నాయి.

అది మహావిష్ణువు హిరణ్యకశిపును చంప టాని కెత్తిన నృసింహావతారం.



"మాయావి అయిన విష్ణువు నన్ను చంపటానికి ఈ రూపంలో వచ్చి ఉంటాడు. అయినా నన్నితనేం చెయ్యగలడు?" అనుకుని హిరణ్యకశిపుడు చేత గద పట్టుకుని నృసింహుడి పైకి పెడబొబ్బ పెడుతూ వెళ్ళాడు. నృసింహుడు అతన్ని, గరుత్మంతుడు పామును పట్టినట్టుగా పట్టాడు. అయితే హిరణ్యకశిపుడు పాము జారినట్టుగానే ఆ పట్టు తప్పించుకున్నాడు. తప్పించుకుని ఆ హిరణ్యకశిపుడు, ఆ నృసింహుడు తన బలానికి భయపడ్డా డనుకుని, కత్తీ డాలూ పట్టుకుని నృసింహుడితో యుద్ధానికి తలపడ్డాడు. వెంటనే అతన్ని నృసింహుడు ఒడిసి పట్టుకున్నాడు. ఆయన కాంతికి హిరణ్యకశిపుడు ఏమీ చూడలేక కళ్ళు మూసుకుని తప్పించుకు పోజూశాడు. కాని అది సాధ్యం కాలేదు.

నృసింహుడు హిరణ్యకశిపుణ్ణి, పగలూ రాత్రీ కాని సంధ్యాసమయంలో, తన తొడ మీద పెట్టి, గోళ్ళతో అవలీలగా చీల్చి చంపేశాడు. తరువాత కొందరు రాక్షసులు తన పైకి ఆయుధాలతో రాగా వారిని కూడా చంపి, ఇక తనను ప్రతిఘటించే వారెవరూ లేకపోయే సరికి వెళ్ళి సింహాసనం మీద కూర్చున్నాడు. ఆయన అవతారం అత్యంత భయానకంగా ఉన్నది.

అక్కడికి బ్రహ్మ మొదలుగా గల దేవతలంతా చేరారు, లోకకంటకుడైన హిరణ్యకశిపుణ్ణి చంపినందుకు ఆయనను స్తుతించారు. కాని ఆయనలో సౌమ్యం ఏర్పడలేదు. అప్పుడు బ్రహ్మ ప్రహ్లాదుణ్ణి పిలిచి నృసింహుణ్ణి శాంతింప జెయ్యమన్నాడు.

ప్రహ్లాదుడు ధైర్యంగా ఆ నృసింహుణ్ణి సమీపించి, ఆయనను స్తుతించి ప్రశాంతుణ్ణి చేశాడు.

తరువాత ప్రహ్లాదుడు తన తండ్రికి ఉత్తరక్రియలు జరిపి తానే రాజై రాజ్యపాలన చేశాడు. —(ఇంకా వుంది)






## 2

[రాజా మానసింహుడి కొడుకైన జగతసింహుడు విష్ణుపురం నుంచి మందారణానికి వెళ్ళే మార్గంలో అశ్వారూఢుడై ఒంటరిగా ప్రయాణిస్తూ, గాలి వానలో చిక్కి, చీకటిలో శైలేశ్వరాలయం చేరుకుని, అక్కడ ఒక కులీను రాలైన నవయౌవనితోనూ, ఆమె పరి చారిక విమల తోనూ పరిచయం చేసుకున్నాడు. ఆ యౌవని పై అతనికి ప్రేమ ఏర్పడింది. తా నెవరో ఆ స్త్రీలకు తెలిపాడు గాని, వారిని గురించి అతను తెలుసుకోలేక పోయాడు. సరిగా పదిహేను రోజులకు అదే శైలేశ్వరాలయానికి వస్తే తన సఖి వృత్తాంతం చెబుతానని విమల అతనికి మాట ఇచ్చిన మీదట ఎవరి దారిన వారు వెళ్ళి పోయారు.]

జగతసింహుడు వంగదేశానికి ఎందుకు వచ్చాడో, ఆ ప్రాంతంలో ఒంటరిగా ఎందుకు తిరుగుతున్నాడో తెలుసుకోవాలంటే ఆ నాటి వంగదేశపు రాజకీయాలు క్లుప్తంగా అయినా తెలుసుకోవాలి.

వంగదేశంలో ఇస్లాము జయపతాకను బఖ్తియార్ ఖిల్జీ ఎగురవేసిన తరువాత చాలా కాలం ముసల్మానుల పరిపాలన నిరాటంకంగా సాగింది. అక్బరు కాలం దాకా వంగదేశాన్ని పఠానులే పాలించారు.

కాని, దావూద్‌ఖాన్ అనే బుద్ధిహీనుడు సింహాన్ని తట్టి లేపినట్టుగా అక్బరును కవ్వించి, యుద్ధం తెచ్చి పెట్టుకున్నాడు. అక్బరు సేనాపతి అయిన మునవ్వర్‌ఖాన్

బంకించంద్ర చట్టోపాధ్యాయ



అతన్ని ఓడించి రాజ్యభ్రష్టుణ్ణి చేసేశాడు. దావూద్‌ఖాన్ వంగదేశాన్ని మొగలుల వశం చేసేసి, సపరివారంగా ఒరిస్సాకు పోయి అక్కడ తల దాచుకున్నాడు.

ఈ విధంగా ఉత్కళదేశంలో స్థిరపడి పోయిన పఠానులను అక్కడి నుంచి కదిలించటం మొగలులకు కష్టమయింది. అయితే చివర కెలాగో వారు ఉత్కళాన్ని తమ అధీనంలోకి తీసుకురాగలిగారు.

ఇది ఇలా ఉండగా మరొక ఉపద్రవం వచ్చిపడింది. వంగదేశంలో భూమి పన్ను వసూలు చెయ్యటానికి అక్బరు ఒక ప్రణాళికను జారీ చేశాడు. ఇది వంగదేశపు జాగీర్దార్లలోనూ, జమీందార్లలోనూ తీవ్రమైన అసంతృప్తినీ, ద్వేషాన్నీ రెచ్చగొట్టింది. వారు సాయుధులై రాజవిద్రోహం చెయ్యటానికి సంసిద్ధులైనారు.

ఉత్కళంలో అణగి పడి ఉన్న పఠానులకు మంచి అవకాశం దొరికింది. కతలూఖాన్ అనేవాడు తిరుగుబాటుకు నాయకత్వం వహించాడు. మిడ్నపూర్ అతని అధీనంలోకి వచ్చింది.

అక్బరు సమర్థుడు, పరిజ్ఞానం కలవాడు. పరిపాలనా నిర్వహణలో రాజపుత్రులనే ఏర్పాటు చేశాడు. వారిలో మానసింహుడు ముఖ్యుడు. ఆయన అక్బరు కుమారుడైన సలీమ్‌కు బావమరిది. ఆ మానసింహుణ్ణే అక్బరు వంగ బీహారు దేశాలకు శాసనాధికారిగా నియమించి పంపాడు.

మానసింహుడు పాట్నాకు వచ్చి, అక్కడి చిక్కులు సరిచేసి, ఉత్కళ దేశాన్ని జయించటానికి పోతూ, తన ప్రతినిధిగా సయ్యద్‌ఖాన్ అనే వాణ్ణి నియమించాడు. తరువాత ఒకసారి మానసింహుడు దేశాన్ని జయించే ప్రయత్నంలో తన సేనతో సహా వర్ధమాననగరానికి వెళుతూ, సైన్యంతో సహా అక్కడికి వచ్చి తనను కలుసుకోవలిసిందని సయ్యద్‌ఖాన్‌కు కబురు చేశాడు.

కాని సయ్యద్‌ఖాన్ సైన్యాన్ని అయత్తం చెయ్యటానికి వ్యవధి కావాలనీ, ఇంతలో వర్షాలు వచ్చేస్తాయనీ, వర్షాకాలం గడిచినాక సేనతో వచ్చి చేరుతాననీ అతను దూత ద్వారా మానసింహుడికి కబురు చేశాడు. మానసింహుడు చేసేది లేక, దారుకేశ్వర తీరాన శిబిరం ఏర్పాటు చేసుకుని, సయ్యద్ ఖాన్ రాక కెదురుచూస్తూ ఉండిపోయాడు.

సయ్యద్‌ఖాన్ తాత్సారాన్ని చూసి కతలూ ఖాన్ విజృంభించాడు. అతను మందారణ ప్రాంతానికి సేనతో వచ్చి, పరిసర ప్రాంతాలను కొల్ల గొట్టి దోచుకోసాగాడు.

ఈ వార్త విని మానసింహుడు కలవర పడ్డాడు. శత్రుదళాల ఆచూకీ సంపాదించ టానికి ఎవరినైనా పంపితే బాగుంటుందని ఆయన అనుకున్నాడు. ఆయన వెంట ఉంటున్న ఆయన కుమారుడు జగత సింహుడే అందుకు సిద్ధ పడ్డాడు. మాన సింహుడు అతని వెంట నూరుగురు అశ్విక యోధుల నిచ్చి పంపాడు. జగతసింహుడు శత్రువుల ఆచూకీ త్వరలోనే సంపాదిం చాడు. అతను ఈ విధంగా పని ముగించు కుని తన తండ్రి వద్దకు తిరిగి పోయేటప్పుడే శైలేశ్వర మందిరంలో స్త్రీలను కలుసు కోవటం జరిగింది.



జగతసింహుడు శైలేశ్వర మందిరం నుంచి బయలుదేరి, సైనిక శిబిరాన్ని చేరు కుని తన తండ్రి అయిన మానసింహ మహారాజుకు పఠానులను గురించి ఈ వివ రాలు తెలిపాడు:

"ధరపుర గ్రామానికి సమీపంలో పఠా నులు తమ సైనిక శిబిరం ఏర్పాటు చేసు కున్నారు. అక్కడ యాభై వేల మంది సైనికు లున్నారు. వారు అక్కడి పరిసర గ్రామాలను కొల్ల గొట్టి దోచుకుంటున్నారు. అక్క డక్కటా కోటలు నిర్మించుకుని యథేచ్ఛగా ఆ ప్రాంతాల తమ అధికారాన్ని చలాయిస్తున్నారు."



పంపి, పఠాను దళాలను అదుపులో ఉండే లాగు చేస్తే బాగుంటుందని నాకు తోస్తున్నది."

ఈ పని చేయటానికి జగతసింహుడు సిద్ధ పడ్డాడు. పది వేల సేనతో వెళ్ళి, కతలూ ఖాన్‌ను సువర్ణరేఖ నది దాటి వెళ్ళేటట్టు చేయగలనని అతను ప్రతిజ్ఞ చేశాడు.

జగతసింహుడు విష్ణుపురం నుంచి జహానా బాదుకు ప్రయాణమై వెళ్ళాడు. ఆ మార్గా నికి కొంచెం దక్షిణంగా మందారణ గ్రామం ఉన్నది. జగతసింహుడు మందిరంలో కలుసుకున్న స్త్రీలు ఆ నగరానికి చెందినవారే.

దామోదర నది ఆ నగరం మీదుగా ప్రవహించేది. అది పెద్ద మలుపు తిరిగిన చోట ముక్కోణాకారం గల భూభాగాన ఒక ఎత్తయిన దుర్గం ఉండేది. నది ఆ దుర్గాన్ని రెండు పక్కలా ఒరిసి ప్రవహించేది. ఈ దుర్గాన్ని జయధరసింహు డనే హిందూ యోధుడు జాగీరుగా పొందాడు. ఈ కథ జరిగే కాలానికి ఆ కోట జయధరసింహుడి వారసుడైన వీరేంద్రసింహుడిది.

వీరేంద్రసింహుడు యువకుడై ఉండగా అతనికీ, అతని తండ్రికీ ఒక్క క్షణం పడేది కాదు. వీరేంద్రసింహుడి కోసం తండ్రి ఒక కన్యను నిశ్చయించాడు. ఆమె కూడా ఒక జమీందారు కూతురు. మంచి అందగత్తె.

పఠానుల ఈ విజృంభణను అరికట్టా లనే ఉద్దేశంతో మానసింహ మహారాజు తన సైనికాధికారులను సమావేశ పరిచి వారితో ఇలా అన్నాడు :

"గ్రామం తరువాత గ్రామం, పరగణా తరువాత పరగణా ఢిల్లీ చక్రవర్తి అధీనం నుంచి జారి పోతున్నాయి. పఠానులను ఎలాగైనా అరి కట్టాలని నా ఉద్దేశం. వారితో యుద్ధానికి తలపడి, వారిని కోటలలో నుంచి తరిమి వేయగల బలం మనకు లేదు. సయ్యద్ ఖాన్ వచ్చేదాకా యుద్ధానికి పూను కోవటం మంచిది కాదు. ఈ లోపుగా మనం బుద్ధికుశలుడైన సేనాపతికి కొద్ది సైన్యాన్నిచ్చి



ఆమె తల్లి తండ్రులకు ఏక సంతానం. కాని వీరేంద్రసింహుడు సంబంధాన్ని వదులుకుని, ఒక అనాథ స్త్రీని పెళ్ళాడాడు.

ముసలి జమీందారుకు కోపం వచ్చి, కొడుకును ఇంటి నుంచి వెళ్ళగొట్టాడు. యువకుడైన వీరేంద్రసింహుడు సైనిక వృత్తి అవలంబించటానికి ఢిల్లీకి బయలుదేరాడు. ఆ సమయంలో అతని భార్య గర్భవతిగా ఉండటంచేత అత నామెను వెంట తీసుకుపోక తల్లి దగ్గరనే ఉంచి వెళ్ళాడు.

కొడుకును ఇంటి నుంచి బహిష్కరించినాక ముసలి జమీందారు పుత్రవియోగంతో బాధ పడ్డాడు. ఎంత ప్రయత్నించినా కొడుకు జాడ తెలియలేదు. అందుచేత ఆయన తన కోడలిని పుట్టింటి నుంచి తన ఇంటికి తెచ్చుకున్నాడు. ఆమె ఒక ఆడ శిశువును కని, కొన్నాళ్ళ అనంతరం చనిపోయింది.

వీరేంద్రసింహుడు ఢిల్లీ పాదుషా అనుమతితో రాజపుత్ర సేనలో చేరి, త్వరలోనే మంచి పదవి సంపాదించుకుని, కొద్ది సంవత్సరాలపాటు ధనమూ, కీర్తీ గడించాడు. తరువాత అతను తన తండ్రి మరణ వార్త విని స్వస్థానానికి తిరిగి వస్తూ, ఢిల్లీ నుంచి తన వెంట విమల అనే స్త్రీనీ, అభిరామస్వామి అనే సన్యాసినీ తీసుకు వచ్చాడు.




విమల ఇంటి పనులు చూసేది, ప్రత్యేకించి వీరేంద్రసింహుడి కుమార్తె పెట్టుపోతలు చేస్తూ ఉండేది. ఆమె చేసే పనులు దాసీలు చేసేవే అయినప్పటికీ, ఆమెను కేవల పరిచారికగా ఎవరూ చూసేవారు కారు, ఇంటి మనిషిలాగే గౌరవించేవారు. కొంచెం వయసు ముదిరినప్పటికీ ఆమె చాలా అందంగా ఉండేది. నవయౌవనంలో ఆమె అసాధారణ సౌందర్యవతి అయి ఉండేదనిపించేది.

ఆమె సమయజ్ఞతా, మాట చాతుర్యం చూస్తే సంస్కారం గల కులంలో పుట్టిన దానిలాగా కనిపించేది.



వీరేంద్రుడి వెంట వచ్చిన సన్యాసి అభిరామస్వామి కోటలో ఎల్లప్పుడూ ఉండేవాడు కాడు. ఒకటి, రెండు నెలలు మందారణ దుర్గంలో ఉంటే, ఒకటి రెండు నెలలు దేశ సంచారం వెళ్ళేవాడు. అభిరామస్వామి వీరేంద్రుడి దీక్షా గురువని అందరూ అనుకునేవారు. వారిద్దరూ ఒకరి నొకరు గౌరవించుకునే వారు. ఏ విషయం లోనైనా వీరేంద్రసింహుడు అభిరామస్వామి సలహా ప్రకారమే నడిచేవాడు.

విమలా, అభిరామస్వామీ కాక, అస్మానీ అనే దాసీ కూడా ఢిల్లీ నుంచి వీరేంద్ర సింహుని వెంట వచ్చింది.

తిలోత్తమా, విమలా శైలేశ్వరమందిరం నుంచి మందారణానికి తిరిగి వచ్చిన మూడు నాలుగు రోజుల తరువాత ఒకనాడు వీరేంద్ర సింహుడు తన సభాభవనంలో కూర్చుని ఉండగా అక్కడికి అభిరామస్వామి వచ్చాడు. వీరేంద్రుడు గౌరవంగా లేచి నిలబడి నమస్కారం చేసి, ఆయన కొక దర్భాసనం చూపాడు.

ఇద్దరూ ఎవరి ఆసనాలపై వారు కూర్చున్నాక అభిరామస్వామి, "పఠానులకూ, మొగలులకూ ఘోర యుద్ధం జరగబోతున్నది. ఆ సందర్భంలో నీవేమి చెయ్య దలిచావు?" అని అడిగాడు.

"శత్రువులను నా బాహు బలంతో ఓడిస్తాను," అన్నాడు వీరేంద్రుడు.

"వీరు డనదగిన మాటే అన్నావు. కాని నీ దగ్గిర ఉండే సేన వెయ్యిమందే కదా, లక్షమంది సైన్యం గల శత్రువు నెలా జయిస్తావు? అటు మొగలులూ, ఇటు పఠానులూ కూడా బలవంతులే. అందులో ఏదో ఒక పక్షం నీకు సహాయం చేస్తేనేగాని రెండో పక్షాన్ని జయించలేవు. రెండు పక్షాలకూ శత్రువు కావటంకంటె ఒక పక్షాన్ని మంచి చేసుకోవటం క్షేమం కద!" అని అభిరామస్వామి అన్నాడు.

"ఏ పక్షాన చేరమని మీ ఆజ్ఞ?" అని వీరేంద్రు డడిగాడు.

"యతో ధర్మ స్తతో జయః! ధర్మం ఉన్న పక్షాన్ని అవలంబించు. రాజద్రోహం మహా పాపం గనుక రాజు పక్షాన్ని అవలంబించు," అన్నాడు అభిరామస్వామి.

"ఎవరు రాజు? మొగలులూ, పఠానులూ కూడా రాజ్యం కోసమే గదా పోట్లాడబోతున్నారు?" అన్నాడు వీరేంద్రుడు.

"కర్మశీలుడైన అక్బరు పాదుషాయే రాజు," అని అభిరామస్వామి చెప్పాడు.

ఈ మాట వినగానే వీరేంద్రుడి ముఖాన కోపమూ, చిరాకూ కనిపించాయి; కళ్ళు ఎర్రబడ్డాయి. అతను అభిరామస్వామితో, "స్వామీ, మీ ఆశీర్వాదం ఉన్నట్టయితే ఆ మానసింహుడి రక్తంతో నా చేతులు కడుక్కుంటాను," అన్నాడు.

"పాదుషాను ఆశ్రయించమన్నాను గాని, మానసింహుణ్ణి ఆశ్రయించమనలేదు. శాంతించు, కోపోద్రేకంతో ఆత్మ హాని తెచ్చుకోకు. మానసింహుడు నీకు చేసిన అపరాధానికి తప్పక శిక్షించ వలసిందే. కాని అక్బరు పక్షాన యుద్ధం చేయుటం గురించి నీ అభిప్రాయ మేమిటి?" అన్నాడు అభిరామస్వామి.



అక్బరు పక్షం అవలంబించి మానసింహుడి కింద యుద్ధం చెయ్యవలసి వస్తే అది తనకు సాధ్యం కాదని వీరేంద్రసింహుడన్నాడు; తనకు పఠానులతోనే చేరాలని ఉన్నట్టు కూడా బయట పెట్టాడు.

ఈ మాట విని అభిరామస్వామి కన్నీరు కార్చాడు. అది చూసి కంగారుపడి వీరేంద్రసింహుడు ఆసనం మీది నుంచి లేచి, ఆయనకు క్షమాపణ చెప్పుకున్నాడు, కర్తవ్యం ఆజ్ఞాపించమన్నాడు.

అభిరామస్వామి తన శాలువతో కళ్ళు తుడుచుకుని, "నాకు నీ పైన కన్న కూడా నీ కుమార్తె పైన అభిమానం జాస్తి. ఇటీ

వల నే నామె జాతకాన్ని గుణించాను. మొగలాయి సేనాపతి వల్ల ఆమెకు గొప్ప కష్టం కలగనున్నది. మొగలులను మిత్రులుగా చేసుకుంటే ఆ ఆపద తప్పి పోవచ్చు. అందుకే వారి పక్షం చేరమన్నాను. నీ కుమార్తె విషయం బయటపెట్టి నిన్ను బాధించ దలచలేదు. కాని ఆమె కా కష్టం తప్పదు గనకనే నీకు పఠానుల పక్షం కావాలన్న దృఢసంకల్పం ఏర్పడిందేమో!" అన్నాడు.

ఆయన లేచి వెళ్ళి పోబోతూ, "ద్వారం వద్ద కతలూఖాన్ దూత వేచి ఉన్నాడు. అతణ్ణి ఆపి ఉంచమని ద్వారపాలకుడికి చెప్పాను. నేను చెప్పవలసింది చెప్పేశాను గనుక, ఆ దూతను యిక్కడికి పిలిపించి అతనికి చెప్పవలిసిన సమాధానం చెప్పి పంపెయ్యి," అన్నాడు.

"స్వామీ, నా అభిప్రాయం మార్చుకున్నాను. మానసింహుడి కింద కూడా పని చేస్తాను. ఆ దూతను లోపలికి పంపమని ద్వారపాలకుడితో చెప్పండి," అన్నాడు వీరేంద్రసింహుడు.

కొద్ది సేపట్లో కతలూఖాన్ దూత వచ్చి వీరేంద్రసింహుడి కొక లేఖ ఇచ్చాడు. అందులో ఇలా ఉన్నది:

"వీరేంద్రసింహా, వెయ్యిమంది అశ్వసైనికులనూ, అయిదు వేల బంగారు నాణాలనూ పఠాను శిబిరానికి పంపించు. లేకపోతే నా సైనికులు ఇరవై వేల మంది మందారణ దుర్గంపై దాడి చేయగలరు—కతలూఖాన్."

వీరేంద్రసింహుడు ఉత్తరం చదువుకుని దూతతో, "సేనను పంపిస్తానని మీ ప్రభువుతో చెప్పు!" అన్నాడు. దూత బయిటికి వెళ్ళిపోయాడు.

ఆ సభా భవనంలో జరిగిన సంభాషణలన్నిటినీ విమల చాటు నుంచి విన్నది.

—(ఇంకా ఉంది)





# అస్థిపంజరం

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీవు అపూర్వ శక్తులను కోరి ఇలా శ్రమపడుతున్న పక్షంలో నీ ప్రయత్నాన్ని మానుకోవటం మంచిది. ఎందుకంటే ఈ అపూర్వశక్తులు ఒక్కొక్క సారి అవసరం కలిగినప్పుడు అందకుండా పోయి ప్రమాదం తెచ్చిపెడతాయి. అందుకు తార్కాణంగా శ్రుతవర్మ కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు :

పూర్వం కన్యాకుబ్జదేశంలో కృతవర్మా, శ్రుతవర్మా అని ఇద్దరు మిత్రులుండేవారు. వాళ్ళు, ఆ బాల్య స్నేహితులు; కాని వారి స్వభావాలు వేరు. కృతవర్మ కార్యదీక్ష గలవాడు, శ్రుతవర్మ సోమరి. కృతవర్మకు కష్టపడి విజయాలు సాధించటం ఇష్టం; శ్రుతవర్మకు తాగుడూ, జూదమూ ఇష్టం.

## బేతాళ కథలు



అయితే ఉన్నచోట అవకాశాలు లేక కృతవర్మ బ్రతుకుతెరువు కోసం మరొక దేశానికి పోవాలని నిశ్చయించుకున్నాడు. శ్రుతవర్మ కూడా అతని వెంట బయలుదేరాడు. ఇద్దరూ కలిసి నదులూ, కొండలూ, లోయలూ దాటి మరొక దేశం వెళ్ళారు. అక్కడ కృతవర్మ అహోరాత్రాలు శ్రమపడి పని చేసి, పుష్కలంగా డబ్బు పోగు చేసుకున్నాడు. శ్రుతవర్మ జూదరులతోనూ, తాగుబోతులతోనూ తిరిగి, తుచ్ఛమైన సుఖాలలో కాలం వెళ్ళబుచ్చాడు.

మూడేళ్ళు గడిచాయి. కృతవర్మ తాను సంపాదించిన డబ్బుతో స్వదేశానికీ, స్వగ్రామానికీ తిరిగి పోవాలని నిశ్చయించుకున్నాడు. అతను శ్రుతవర్మను, "నేను మన ఊరికి తిరిగి పోతున్నాను. నువుకూడా వస్తావా?" అని అడిగాడు.

"నాకూ్కడా రావాలనే ఉంది. ఈ దేశం కాని దేశంలో నా కేమీ సుఖంగాలేదు. కాని ఎలా రాను? ప్రయాణపు ఖర్చుకు నా దగ్గర చిల్లిగవ్వ లేదు. మంచి బట్టలైనా లేవు," అన్నాడు శ్రుతవర్మ.

ఇద్దరూ కలిసే వచ్చారేమో, కృతవర్మకు ఒంటరిగా తిరిగి వెళ్ల బుద్ధిపుట్టలేదు. అతను శ్రుతవర్మకు బట్టలు కొనిపెట్టి, ప్రయాణపు ఖర్చులు తానే భరిస్తానని చెప్పి, అతన్ని కూడా తన వెంట బయలుదేరదీశాడు.

వారు తమ దేశాన్ని సమీపిస్తూండగా, ఒక నిర్జనమైన కొండ కనుమలో శ్రుతవర్మ తన మిత్రుణ్ణి చంపేసి, అతని శవాన్ని దారి పక్క పొదలలోకి ఈడ్చేసి, అతని డబ్బంతా తీసుకుని, ఏమీ ఎరగనట్టు తన గ్రామానికి వచ్చేశాడు.

గ్రామస్థులు కృతవర్మను గురించి అడిగారు. శ్రుతవర్మ వారితో, "వాడి మాట అడగకండి. మరో దేశం చేరగానే వాడు పూర్తిగా మారిపోయాడు. పాడు బుద్ధులు అలవరుచుకుని, పాడు స్నేహితాలు మరిగి,

ఎందుకూ పనికిరాకుండా పోయాడు. దారి ఖర్చులకైనా డబ్బు లేదు. అందుచేత వాడు అక్కడే ఉండిపోయాడు," అని చెప్పాడు.

కృతవర్మ పూర్తిగా మారిపోయాడని చెప్పిన శ్రుతవర్మ తానుమాత్రం ఏమీ మారలేదు. అతను పాచికలాటలలోపడి, తాను కృతవర్మను చంపి కాజేసిన డబ్బంతా పోగొట్టుకున్నాడు. చివరకు అతనికి తన గ్రామంలో జరుగుబాటు కాలేదు. అతను దేశాంతరాలకు మళ్ళీ బయలుదేరాడు.

శ్రుతవర్మ, తాను కృతవర్మను చంపిన కొండ కనుమ కుండా నడుస్తూండగా, "శ్రుతా! శ్రుతా!" అని ఎవరో పిలిచినట్టయింది. వెనక్కు తిరిగి చూస్తే ఎవరూ కనిపించలేదు. భ్రమ అయి ఉంటుందనుకుని శ్రుతవర్మ ముందుకు సాగాడు. కాని మళ్ళీ అదే కేక వినపడింది.

అతను ఆశ్చర్యపడుతూ ఈసారి శ్రద్ధగా ఆలకించి, ఆ పిలుపు దారికి పక్కగా ఉన్న పొదల వెనక నుంచి వస్తున్నట్టు తెలుసుకున్నాడు. అతను పొద దగ్గిరికి వెళ్ళి చూసేసరికి ఒక అస్థిపంజరం కనిపించింది.

అతను దాని కేసి నిర్ఘాంతపోయి చూస్తూండగా ఆ అస్థిపంజరం, "నన్నప్పుడే మరిచిపోయావా, శ్రుతా? మూడేళ్ళ కిందట



నన్ను చంపి, నా డబ్బు కాజేశావు. నేను కృతవర్మను. ఎప్పటికైనా తిరిగి కనపడక పోతావా అని నీ కోసం ఇక్కడ రోజూ ఎదురుచూస్తున్నాను. ఇవాళ నువు కనబడ్డావు, నా కోరిక ఫలించింది. నా కెంతో ఆనందంగా ఉన్నది!" అన్నది.

శ్రుతవర్మ కంగారుపడి అక్కడి నుంచి పారిపోదామనుకున్నాడు. కాని అస్థిపంజరం అతని బట్ట గట్టిగా పట్టుకుని పోనివ్వలేదు.

"ఎక్కడికి పోతున్నావు?" అని అది శ్రుతవర్మ నడిగింది.

శ్రుతవర్మ నిజం చెప్పేశాడు. "మన ఊరెళ్ళాను. డబ్బంతా ఖర్చయిపోయింది.



ఎక్కడన్నా పని చూసుకుందామని ఇలా బయలుదేరాను. నన్ను వెళ్ళనీ, నీకు పుణ్యం ఉంటుంది," అన్నా డతను.

"అలాగా? అయితే నువు కొంచెం కూడా మారలేదన్న మాట. నీ కెప్పుడూ చిక్కులే! నేను నృత్యాలు చేసి నీకు డబ్బు సంపాదించి పెడతాను. ఏమంటావు? నన్నొక పెట్టెలో పెట్టి వెంట తీసుకు పో. నాకా, తిండి ఖర్చులేదు, బట్ట ఖర్చులేదు. ఇంత తక్కువ ఖర్చుతో హెచ్చు డబ్బు నువ్వింకే విధానా సంపాదించ లేవు. నేనేం నృత్యాలు చేస్తానా అని ఆశ్చర్యపడు తున్నావు కాబోలు. ఇదుగో, చూపిస్తాను చూడు!" అంటూ అస్థిపంజరం అడుగులు వేస్తూ రకరకాల నృత్యాలు చేసింది.

"చూశావు గదా, శ్రుతా. నువు నీ యిష్టం వచ్చినపాట పాడు. దానికి లయ సరిపోయే టట్టు నేను నృత్యం చేస్తాను. ఏమంటావు? బోలెడంత డబ్బు సంపాదించవచ్చు, కాదూ?" అన్నది అస్థిపంజరం.

"నిజమే. నువ్వన్నట్టు డబ్బు ఎంతైనా సంపాదించవచ్చు," అని శ్రుతవర్మ ఒప్పు కుని, అస్థిపంజరాన్ని తీసుకుని బయలు దేరాడు. అతను ప్రతి గ్రామంలోనూ తాను పాటలు పాడుతూ, అస్థిపంజరం చేత నృత్యాలు చేయించాడు. నృత్యం చేసే అస్థి పంజరం ఖ్యాతి వాడవాడలా పాకింది. చివ రకు ఆ దేశపు రాజుగారికి కూడా ఈ సంగతి తెలియవచ్చింది.

ఆయన ఈ అస్థిపంజరపు నృత్యం కళ్ళారా చూస్తేగాని నమ్మ దలచలేదు. ఆయన శ్రుతవర్మకు కబురు చేసి తన దేవిడీలోనే నృత్య ప్రదర్శనానికి ఏర్పాట్లు చేశాడు. ప్రదర్శనం చూడటానికి గొప్ప గొప్ప వాళ్ళంతా వచ్చారు.

కాని ఏ కారణంచేతనో అస్థిపంజరం నృత్యం చెయ్యలేదు సరే కదా, కదలనన్నా కదలలేదు. శ్రుతవర్మ ఎన్నో పాటలు పాడి

చూశాడు. ఏమీ ప్రయోజనం లేకపోయింది. అది మామూలు అస్థిపంజరం లాగే పడి ఉన్నది గాని అందులో విశేషం ఏమీ కని పించలేదు.

శ్రుతవర్మకు పరువంటూ ఉన్నట్టయితే అది ఆ క్షణంలో పోయి ఉండేదే. కాని రాజుగారికి మటుకు తీరని అవమాన మయింది. ఆయన కోపంతో, "ఈ దుర్మా ర్గుడు గ్రామీణులైన ప్రజల కళ్ళలో దుమ్ము కొట్టి ఈ అస్థిపంజరాన్ని అడ్డం పెట్టుకుని డబ్బు చేసుకుంటున్నాడు. ఈ వంచకుణ్ణి తీసుకుపోయి చిత్రవధ చెయ్యండి," అన్నాడు. రాజభటులు శ్రుతవర్మను తీసుకు పోయి చిత్రవధ చేశారు.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, నా కొక్క సందేహం. తన మిత్రుడైన శ్రుతవర్మకు చచ్చి కూడా ఎంతో సహాయం చేసిన కృతవర్మ అస్థిపంజరం రాజుగారి ఎదట ఎందుకు నృత్యం చెయ్యలేక పోయింది? ఆ అస్థిపంజరం లోని శక్తులు ఆకస్మికంగా ఎందుకు పోయాయి? ఈ ప్రశ్నకు సమా ధానం తెలిసి కూడా చెప్పకపోతే నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "కృతవర్మ అస్థిపంజరం రూపంలో శ్రుతవర్మ కోసం ఎదురు చూసింది అతని మీది ప్రేమతో కాదు; నృత్యాలు చేసి శ్రుతవర్మకు కీర్తీ, డబ్బూ సంపాదించి పెట్టింది కూడా తన స్నేహితుడికి సహాయం చేసే ఉద్దేశంతో కాదు. తనను చంపిన శ్రుతవర్మ పైన పగ తీర్చుకోవటానికే ఇదంతా చేశాడు. పగ తీర్చుకోవటం కోసమే రాజు ఎదట అతని అస్థిపంజరం నృత్యం చెయ్యలేదు. అతని పథకం పారింది. రాజు శ్రుతవర్మను చంపి కృతవర్మ పగ తీర్చాడు," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగ గానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)






# పారని ఎత్తులు

ఒక ఊళ్ళో జయంతు డనే వైశ్యుడుండే వాడు. అతను కొద్దిపాటి వ్యాపారంతో కాలక్షేపం చేస్తూ ఉండే వాడు. అతనికి పెళ్ళి కావలిసిన కుమార్తె ఉన్నది. ఆమెకు అన్నివిధాలా మంచి సంబంధం కుదిరింది. ముహూర్తం కూడా అనుకున్నారు.

పెళ్ళి ఖర్చుకుగాను తన దగ్గిర ఉండే డబ్బంతా లెక్క చూసుకోగా తక్కువ అయేటట్టు కనిపించటం చేత, జయంతుడు తమ ఇంట చాలా కాలంగా ఉంటున్న ఒక రత్నాన్ని అమ్మ నిశ్చయించాడు. అతను ఆ రత్నాన్ని తీసుకుని తన గుర్రం మీద రాజధానికి బయలుదేరి వెళ్ళాడు. అతను రాజుగారి దర్శనం చేసుకుని, తాను వచ్చిన పని చెప్పి, రత్నాన్ని చూపించాడు. రాజుగారు రత్న నిపుణులను రప్పించి, వారిచేత రత్నానికి వెల కట్టించాడు. దాని వెల లక్షకు పైన కొన్నివేలుంటుందని వాళ్ళు చెప్పారు.

వాళ్ళు నిర్ణయించిన ధరకు రాజు ఆ రత్నాన్ని కొనటానికి సిద్ధపడ్డాడు. కాని జయంతుడు డబ్బంతా వెంట తీసుకుపోవటం ఇష్టంలేక, ప్రస్తుతం పెళ్ళి ఖర్చులకు కావలిసినంతా తీసుకుని, మిగిలినది ఏడాదికి ఇంత చొప్పున తీసుకుంటానని ఏర్పాటు చేసుకున్నాడు.

అతను నగరపు సంతకు వెళ్ళి ఒక కపిలగోవును కొన్నాడు. తన కుమార్తెను అత్తవారింటికి పంపేటప్పు డిచ్చే కట్న కానుకలతో బాటు ఆ కపిలగోవును కూడా ఇద్దామనుకున్నా డతను. ఆవు మెడ తాడును తన గుర్రం తోకకు కట్టి, తాను గుర్రం మీద ఎక్కి కూర్చుని, గుర్రాన్ని నింపాదిగా నడుపుకుంటూ జయంతుడు ఇంటిదారి పట్టాడు. గుర్రం వెనకగా నడిచేటప్పుడు ఆవు మెడలో ఉండే మువ్వ మోత చేస్తూ వచ్చింది.

పి. వెంకటనారాయణ

జయంతు డొక కొండ వెంబడి పోతూం డగా మువ్వచేసే ధ్వనిలో ఏదో మార్పు కలి గినట్టనిపించింది. అతను వెనక్కు తిరిగి చూశాడు. ఆవు లేదు. దాని మువ్వ గుర్రం తోకకు కట్టి ఉన్నది. అతను ఎత్తుకు ఎక్కి అంతటా కలయజూశాడు. ఎక్కడా ఆవు జాడ లేదు. అతను నిస్పృహ చెంది, తన కా కపిలగోవు ప్రాప్తం లేదనుకుని, ఇంటి దారి పట్టాడు.

జయంతుడి కపిలగోవును కాజేసినవాడు గండు డనే గజదొంగ. జయంతుడు కపిల గోవును కొనటం గండుడు చూశాడు. ఆవునే గాక, అతని వద్ద ఉన్న డబ్బునూ, గుర్రాన్నీ, దుస్తులనూ కూడా కాజెయ్యాలని గండుడికి కోరిక కలిగింది. ఇదంతా ఒక్కడి వల్ల అయ్యే పని కాదు, అందుచేత గండుడు ఆవును కాజేసే పని తన పైన వేసుకుని, మిగిలిన పనికి తన కొడుకైన ప్రచండు డనే వాడిని నియమించాడు.

ప్రచండుడు జయంతుడు వెళ్ళే దారిలో ఒక కొలను గట్టుపైన దాగి కూర్చుని, జయంతుడు సమీపంలోకి వచ్చిన సమ యంలో పెద్ద చావుకేక పెట్టుతూ కొలనులోకి దూకాడు. ఎవడో, పాపం, ప్రమాదవశాన కొలనులో పడిపోయా డనుకుని, జయం




తుడు గుర్రం దిగి, తన తలపాగా, చొక్కా, డబ్బుసంచీ, ధోవతీ ఒకచోట ఉంచి, చిన్న బట్ట చుట్టుకుని, పడిపోయినవాణ్ణి రక్షించ టానికి తాను కూడా కొలనులోకి ఉరికాడు.

అలా దూకే సమయంలో జయంతుడి కాళ్ళ కేదో తాడు తగులుకున్నట్టయింది. దాన్ని వదిలించుకోవటానికి జయంతుడు తిప్పలుపడే సమయంలో ప్రచండుడు ఒడ్డుకు ఈది, ఒడ్డున ఉన్న ఒక రాయిని నీటిలోకి తోసి, జయంతుడి బట్టలూ, సంచీ తీసుకుని గుర్రమెక్కి పారిపోయాడు.

రాయి నీటిలో పడి మునిగేటప్పుడు అది జయంతుణ్ణి కూడా అడుగుకు ఈడ్చింది;

ఎందుకంటే, కాలికి ఉచ్చుపడిన తాడు యొక్క రెండో కొస రాతికి కట్టబడి ఉన్నది. అది ప్రచండుడి పనే. జయంతుడు అతి ప్రయాసతో తన మొలతాడుకు కట్టి ఉన్న చిన్న చాకు తీసి, దానితో రాయికి కట్టిన తాడును కోసి, పైకివచ్చి, ఒడ్డుకు ఈది, నీరసంగా పడిపోయాడు.

డబ్బు పోగొట్టుకుని, దుస్తులు పోగొట్టుకుని, చివరకు గుర్రాన్ని కూడా కోల్పోయిన జయంతుడు ఎక్కడికి పోవటానికీ, ఏం చెయ్యటానికీ అశక్తుడై, ఎవరి కళ్ళనైనా పడటానికి కూడా బిడియపడుతూ ఉన్న స్థితిలో చీకటి పడేవేళ కొందరు కట్టెలు కొట్టే వాళ్ళు ఇళ్ళకు తిరిగిపోతూ అతన్ని చూసి, అతనికి జరిగిన అన్యాయం తెలుసుకుని, అతను కట్టుకునేటందుకు తమ పై బట్ట ఒకటి ఇచ్చి, అతణ్ణి తమ ఇళ్ళకు తీసుకుపోయారు.

ఆ రాత్రి వాళ్ళ వెంటనే గడిపి జయంతుడు, మర్నాడు వాళ్ళిచ్చిన బట్టలే కట్టుకుని దివాణానికి తిరిగివెళ్ళి, రాజుగారికి జరిగినదంతా చెప్పి, మరికొంత డబ్బిప్పించమని వేడుకున్నాడు.

"డబ్బు ఇవ్వటాని కేముంది? అంతా ఇచ్చెయ్యమన్నా ఇస్తాం. కాని దొంగలు పట్టుబడినదాకా మీరు దివాణంలోనే రెండు



రోజుల పాటుండటం మంచిది," అని మంత్రి జయంతుడికి సలహా ఇచ్చి, అతనికి అతిథి గృహంలో అన్ని ఏర్పాట్లూ చేశాడు.

ఆ పూటే మంత్రి చాటింపు వేయించాడు: రాజుగారికి నల్ల ఆవులు కావాలి; ఒక్కొక్క ఆవుకూ వెయ్యేసి రూపాయలు బహుమానం!

ఈ చాటింపు వింటూనే గండుడి భార్య, తన భర్త కిందటి రోజు తెచ్చి ఇంట్లో కట్టిన కపిలగోవును రాజుగారి దివాణానికి తోలుకు పోయింది. అది దొంగిలించిన ఆవని ఆమెకు తెలియదు. తన భర్తగాని, కొడుకుగాని దొంగతనాలు చెయ్యటం ఆమె కెంత మాత్రమూ గిట్టదు. అందుచేత గండుడు తన భార్యతో ఆ నల్ల ఆవును సంతలో యాభై రూపాయలకు కొన్నానని చెప్పాడు. ఆమె ఆ మాట నిజమే ననుకుని, యాభై రూపాయల ఆవుకు వెయ్యి రూపాయలిస్తారు గదా అని ఆశ పడింది.

ఇలాగే దివాణానికి మరికొన్ని నల్ల ఆవులు కూడా వచ్చాయి. కాని గండుడి భార్య తెచ్చిన ఆవే తనదని జయంతుడు గుర్తించి, ఆ సంగతి మంత్రికి రహస్యంగా తెలియజేశాడు. "ఈ ఆవు మీ కెక్కడిది?" అని మంత్రి అడిగితే గండుడి భార్య, "నిన్న నా మొగుడు సంతలో కొన్నాడు," అన్నది.



"అయితే నీ వింటికి పోయి నీ భర్తను యిక్కడికి పంపించు. అతడికి డబ్బి చ్చేస్తాం!" అన్నాడు మంత్రి.

గండుడి భార్య ఇంటికి బయలుదేరింది. ఆమె వెనకగా కొందరు రాజ భటులు కూడా వెళ్ళారు.

అవును దొంగిలించి తన ఇంటికి తీసుకు పోయి, కొట్టంలో కట్టేసి, తన భార్యతో అబద్ధం చెప్పిన గండుడు తన కొడుకు వంతు దొంగతనం ఎలా కొనసాగినదీ తెలుసుకోవటానికి వెళ్ళాడు. ఎన్ని చోట్లకు తిరిగినా ప్రచండు డేమైనదీ తెలియలేదు. రాత్రల్లా నిద్ర లేకుండా తిరిగిన గండుడు ఇంటికి చేరుకునే సరికి ఇంట్లో భార్య లేదు, ఆవూ లేదు. అదే సమయంలో గండుడి భార్య వెనకనే వచ్చిన రాజభటులకు గండుడు దొరికిపోయాడు.

వాళ్ళు వాణ్ణి పెడరెక్కలు విరిచి కట్టి రాజు వద్దకు తీసుకుపోయారు.

ప్రచండుడి జాడ గండుడికి తెలియక పోవటానికి కూడా కారణం ఉన్నది. జయంతుడి గుర్రం వాడి ఇచ్ఛానుసారం నడవక మకురుతనం చూపింది. అది తనను ఎక్కడ పడేస్తుందోనన్న భయంతో పగ్గాలు వదిలి, వాడా గుర్రాన్ని దాని యిష్టప్రకారమే పోనిచ్చాడు. అది తిన్నగా జయంతుడి ఇంటికే వెళ్ళింది. జయంతుడి నౌకర్లు గుర్రాన్నీ, గుర్రం మీద ఉన్న వాడి వద్ద గల జయంతుడి దుస్తులనూ, సంచీనీ గుర్తించి, ఏదో మోసం జరిగిందని గ్రహించి, ప్రచండుణ్ణి పట్టి కట్టేసి, మర్నాడు రాజ థానికి తీసుకుపోయారు.

తండ్రి కొడుకు లిద్దరూ ఒకేసారి రాజు గారి ముందు బందీలుగా నిలబడ్డారు. ఇద్దరి దొంగతనాలూ ప్రత్యక్షంగా రుజువయాయి. జయంతుడి సొమ్మూ, దుస్తులూ దొరికాయి. తండ్రి కొడుకు లిద్దరూ కారాగృహంలో బంధించబడ్డారు.





# సవతి తల్లి

ఒక ఊళ్ళో ఒక రైతుండే వాడు. అతని భార్య ఒక మగబిడ్డను కని చనిపోయింది. పిల్లవాడికి వెంకడు అని పేరు పెట్టారు. పిల్లవాడి పెట్టుపోతలు చూసేటందుకు ఇంట్లో ఎవరూ లేకపోవటం చేత రైతు మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడు. రైతు రెండో భార్య పేరు బంగారి.

బంగారి వెంకణ్ణి చాలా గారాబంగా పెంచింది. ఇరుగుపొరుగు వాళ్ళు మాత్రం వెంకణ్ణి చూసినప్పుడల్లా, "పాపం, తల్లిలేని బిడ్డ! ఎంత బాగా చూస్తే మాత్రం సవతి తల్లి సొంత తల్లి అవుతుందా?" అనే వారు. ఈ మాట వెంకడు అనేకసార్లు విన్నాడు. సవతి తల్లి అనే మాట వాడి కొక తిట్టు లాగా వినిపించేది.

బంగారికి పిల్లలు పుట్టనే లేదు. కొంత కాలమయాక రైతు జబ్బు పడి చని పోయాడు కూడా. అప్పుడు ఇరుగుపొరుగు వాళ్ళు వెంకణ్ణి చూసి, "పాపం, వీడికి పుట్టినప్పటి నుంచీ సవతి తల్లి బాధ! కాస్త ప్రేమగా చూసుకోవటానికి తండ్రి ఉన్నాడు గదా అనుకుంటే ఆయనా పోయాడు. ఇక ఆ సవతి తల్లి ఇష్టమే ఇష్టం! ఆవిడతో, పాపం, ఎట్లా వేగుతాడో?" అన్నారు.

ఇటువంటి మాటలు వినీ, వినీ వెంకడికి తన సవతి తల్లి పైన ఒక విధమైన అను మానం ఏర్పడింది. వా డేదన్నా వెధవ పని చేస్తే బంగారి కోప్పడ్డప్పుడు వాడిలో ఉన్న అనుమానం కొంచెం దృఢమయేది, మళ్ళీ ఆమె ప్రేమగా చూసినప్పుడు తగ్గిపోయేది. అందుచేత, ఎవరైనా తన సవతి తల్లి గురించి ఆక్షేపణగా మాట్లాడితే వాడు, "మా చిన్నమ్మ నన్ను బాగానే చూస్తుంది," అనే వాడు.

"కాస్త పెద్దవాడి వవుతున్నావుగా, బాగా చూడకేం చేస్తుందీ? కాని లోలోపల ఏమి

ఆర్. శ్యామలరావు



కుట్ర ఆలోచిస్తున్నదో! కాస్త జాగ్రత్తగా ఉండు," అని హెచ్చరించే వాళ్ళు ఇరుగు పొరుగు వాళ్ళు.

ఇతరు లిటువంటి మాట లన్నప్పుడు వెంకడి మనసులో మళ్ళీ అనుమాన పిశాచం తల ఎత్తేది. సవతి తల్లులు పెట్టే కష్టాలను గురించి వివరాలు వినేటప్పుడు వాడి అనుమానం మరింత అయేది. అందు చేత వాడు తన సవతి తల్లిని ఒక కంట కనిపెడుతూ ఉండే వాడు.

బంగారి రోజూ దేవుడి దగ్గిర దీపారాధన చేసి, దణ్ణం పెట్టుకుని, ఏదో గొణిగేది. ఏమంటుందో వినాలనిపించి వెంకడు ఒక నాడు దగ్గిరలోనే దాగి ఉండి తన పిన్నమ్మ చేసే ప్రార్థన విన్నాడు.

"స్వామీ, దేవుడా! మా వెంకణ్ణి చీమ లాటి వాడుగానూ, ఆడదిలాటి వాడుగానూ, ఎప్పుడూ ఆకలి ఉండేలాటి వాడుగానూ, తాడులాటి వాడుగానూ, మట్టికుండలాటి వాడుగానూ చెయ్యి!" అని బంగారి దేవు డికి దణ్ణం పెట్టుకుంటున్నది.

ఈ మాటలు వినగానే వెంకడి మనస్సు విరిగిపోయింది. వాడికి తన చిన్నమ్మ అసలు స్వరూపం తెలిసినట్టయింది. ఆమె తన మంచి కోరితే దేవుడికి అలా దణ్ణాలు పెడు తుందా? చీమలు తాకితే చస్తాయి; ఆడ వాళ్ళు ఎందుకూ పనికిరాని అసమర్థపు మనుషులు; ఆకలితో అస్తమానమూ మాడే వాళ్ళు అడుక్కు తినేవాళ్ళు; పశువులను కట్టటానికి తప్ప పనికిరానిది తాడు; చిన్న దెబ్బకు చిల్లిపడేది మట్టికుండ—తాను అలా బతకాలని తన చిన్నమ్మ దేవుణ్ణి వేడుకుంటున్నది! ఇంక చిన్నమ్మ మొహం చూసే దెట్లా?

వెంకడు విరక్తి చెంది, ఎవరికీ చెప్ప కుండా ఇల్లు వదిలి, దేశం మీద బయలు దేరాడు. ఎటుపోతున్నదీ, ఎక్కడికి పోతు న్నదీ వాడికి తెలీదు. ఆకలి వేసినప్పుడు

ఏ ఇంటి ముందో నిలబడి, "అమ్మా, కబళం!" అని అరిచే వాడు. దొరికినది తినే వాడు. నిద్రవస్తే ఏ చెట్టు కిందో నిద్ర పోయే వాడు.

ఇలాపోతూ ఒకనాటి సూర్యాస్తమయం వేళ వాడొక అరణ్య ప్రాంతానికి చేరు కున్నాడు. అక్కడ వాడి కొక ఏనుగు పడు కుని ఉండటం కనబడింది. ఎంత సేపటికీ ఆ ఏనుగు కదలకపోయే సరికి వాడు దగ్గి రగా వెళ్ళి, అది చచ్చిన ఏనుగని తెలుసు కున్నాడు. వాడా రాత్రి ఆ సమీపంలో ఉన్న కొండరాళ్ళ పైకి ఎక్కి అక్కడే పడుకుని నిద్రపోయాడు.

మర్నాడు వెంకడు నిద్ర లేవగానే వాడికి ఏనుగు కళేబరం కనబడింది. కాని అది కొద్దిగా జరిగినట్టు వాడికి తోచింది. చచ్చిన ఏనుగు తానై కదలలేదు గనక, అది ఎలా కదిలిందో తెలుసుకోవటానికి వాడు దగ్గరగా వెళ్ళి చూశాడు.

అనేక కోట్ల చీమలు ఆ ఏనుగు కళే బరాన్ని వున్న చోటు నుంచి లాగటానికి యత్నిస్తున్నాయి. ఏనుగు శరీరం వాటి కృషి వల్ల అతినింపాదిగా కదులుతున్నది.

ఇది చూసి వెంకడికి చీమల మీద వెనక ఉండిన తక్కువ భావం పోయి అవంతే గౌరవం ఏర్పడింది.





వెంకడు అక్కడి నుంచి బయలుదేరి, పగలల్లా నడిచి, చీకటిపడే వేళకు ఒక గ్రామం చేరాడు. అక్కడ ఒక పూరి ఇంటి బయట అరుగున్నది. వెంకడు ఇంట్లోకి తొంగిచూశాడు. లోపల ఒక రోగిష్టి వాడూ, ఇద్దరు పిల్లలూ ఉన్నారు.

"ఈ రాత్రికి బయటి అరుగు పైన పడుకోనిస్తారా ? నేను చాలా దూరం నుంచి వస్తున్నాను," అన్నాడు వెంకడు. రోగిష్టి మనిషి సరే నన్నాడు.

లోపల ఉన్న పిల్లలు, "ఆకలేస్తోంది. నిద్ర వస్తోంది. అమ్మ ఇంకా రాదేం?" అని మారాం చేస్తున్నారు.

"వస్తుంది! కాస్త ఓపికపట్టండి. నాకూ ఆకలిగానే ఉంది మరి," అని రోగిష్టి తండ్రి పిల్లలను సమదాయిస్తున్నాడు.

కొంత సేపటికి ఆ పిల్లల తల్లి వచ్చింది.

"అబ్బబ్బ, ఎన్ని పనులు చేసినా ఇంకో పని చెబుతారు! ఎంతకీ వదలరు. అన్ని పనులూ పూర్తి చేసి, కూలి తీసుకుని, బియ్యం కొనుక్కుని వచ్చేసరికి ఈవర యింది," అంటూ ఆమె వంట ప్రారంభించింది. పిల్లలు ఆకలని గోల చేస్తుంటే, "ఇదుగో, అయిపోయింది. రెండు నిమిషాలు!" అని వాళ్ళని ఊరుకోబెట్టింది. వాళ్ళు కూడా శాంతించారు.

మరి కాస్సేపటి కల్లా ఆమె పిల్లలకు అన్నం పెట్టింది, భర్త తాగటానికి గంజి ఇచ్చింది, తాను తినటానికి వడ్డించుకున్నది.

"అన్నట్టు బయటి అరుగు మీద కుర్రాడొకడు పడుకుని ఉన్నాడు. దూరం నుంచి వస్తున్నాట్ట! వాడి సంగతి విచారించావా ?" అన్నాడు భర్త.

"అయ్యో, నేను చూడనే లేదే!" అంటూ ఆమె దీపం తీసుకుని బయటికి వచ్చి, అరుగు మీద వెంకణ్ణి చూసి, "ఎవరబ్బాయీ? కొంచెం అన్నం పెడతా, తిని పడుకో!" అన్నది.

లోపల జరిగేదంతా ఆలకిస్తున్న వెంకడు, "నా కేమీ వద్దమ్మా. మీరు భోంచేయండి," అన్నాడు ఆమెతో.

"అదేమిటి? చేటుగాని చోట ఉన్న వాడివి. ఆకలితో ఎట్లా ఉంటావు? సిగ్గు పడక కొంచెం తిను," అంటూ ఆమె వెంకడికి ఇంత అన్నమూ, పులుసూ తెచ్చి పెట్టింది. వాడది తిని ఇన్ని నీళ్ళు తాగాడు.

మర్నాడు ఉదయం ఆమె వెంకణ్ణి వివరాలడిగింది. వాడు, "నాకెవరూ లేరు. ఊళ్ళు పట్టి తిరుగుతున్నాను," అన్నాడు.

"అయితే నాలుగు రోజులపాటు నువ్విక్కడే ఉండు. నేను పనిచేసే వాళ్ళింట రేపు పెళ్ళి. నాలుగైదు రోజులు మాతోబాటు నీకు కూడా మంచి భోజనం దొరుకుతుంది," అన్న దామె.

వెంకడికి ఆమెను చూస్తుంటే తన పిన్నమ్మ జ్ఞాపకం వచ్చింది. వాడికి ఆడ వాళ్ళ సామర్థ్యంపైన గురి కూడా ఏర్పడింది. ఈ మనిషి ఎవరింటనో ఒళ్ళు హూనమయ్యేటట్టు చాకిరి చేసి వచ్చి ఇంటి పని అంతా చూసుకుంటుంది. ఆమె ఇంటికి వచ్చిన దాకా రోగిష్టి మొగుడూ, పిల్లలూ దిక్కు లేని పక్షులల్లే ఉంటారు. ఆమె రాగానే ఇల్లంతా ఒక దారికి వచ్చేస్తుంది.



పెళ్ళి జరిగింది. వెంకడు నాలుగు రోజులూ మితిమీరి తిన్నాడు. అగ్నిమాంద్యం ఏర్పడి ఆరోగ్యం పాడయింది. "నాకు ఆకలి లేదు. ఒంట్లో బాగాలేదు," అన్నాడు వాడు ఆ ఇంటావిడతో.

"ఆకలే ఆరోగ్యం, నాయనా. ఆకలి లేక పోతే రోగం కాక మరేమిటి?" అన్నదామె, ఆదుర్దా కనబరుస్తూ.

తనకు ఎప్పుడూ ఆకలిగా ఉండాలని పిన్నమ్మ ఎందుకు మొక్కుకున్నదో వెంకడికి అర్థమయింది. తన పిన్నమ్మ గురించి ఈ మనిషికి చెప్పుకోవాలని వెంకడికి అనిపించింది.

వాడు చెప్పినదంతా విని, "ఓరి, పిచ్చి వాడా, నీ పిన్నమ్మ పేరుకు తగ్గట్టు బంగారమే. ఆమె మీద అనుమానపడి వచ్చేశావా? వెంటనే ఇంటికి పో. పాపం, నీ కోసం ఎంత బెంగపడిందో," అన్నదామె.

వెంకడు ఎక్కడా ఆగకుండా నడిచి ఒక నాటి నడిరాత్రి తన ఇల్లు చేరుకున్నాడు. సరిగా అదే సమయంలో ఒక దొంగ తమ ఇంటికి కన్నం వేసి లోపలికి ప్రవేశిస్తూ ఉండటం వాడికి కనిపించింది. వాడు కూడా అదే కన్నంలో నుంచి లోపల ప్రవేశించి దొంగను వెనకనుంచి గట్టిగా పట్టుకున్నాడు.

"చిన్నమ్మా! నేనే! దీపం వెలిగించు," అన్నాడు వాడు, దొంగను పెడరెక్కలు విరిచి పట్టుకుని.

బంగారి దీపం వెలిగించి, దొంగను చూసి, తాడొకటి తెచ్చి దొంగ చేతులను గట్టిగా కట్టింది. ఇరుగు పొరుగు వాళ్ళను లేపేసరికి వాళ్ళు దొంగను పట్టుకుపోయారు.

బంగారి తన కొడుకును మళ్ళీ చూసి ఆనందబాష్పాలు రాల్చి, "చెప్పకుండా చెయ్యకుండా ఎక్కడికి పోయావురా?" అని అడిగింది.

వెంకడు ఆమెతో జరిగినదంతా దాచకుండా చెప్పి, "చిన్నమ్మా, నువు దేవుడికి దణ్ణం పెట్టుకుంటూ నేను చీమలాగా, ఆడదానిలాగా, ఆకలిగా, తాడులాగా ఉండాలని ఎందుకన్నావో అర్థమయింది. కాని మట్టి కుండలాగా ఉండాలని ఎందుకన్నావు?" అని అడిగాడు.

"నాయనా, మట్టికుండ భద్రంగా వాడుకుంటే ఎంత కాలమైనా ఉపయోగపడుతుంది, ఎన్నో విధాల ఉపయోగపడుతుంది. అనేక పనులకు ఇత్తడి, వెండి, బంగారు బిందెల కన్న కూడా మట్టి కుండ శ్రేష్ఠం. ఎంత బీదవాళ్ళకైనా అది అందుబాటులో ఉంటుంది," అన్నది బంగారి. ఈ మాటలు విని వెంకడు తృప్తిపడ్డాడు.





# భయం ఎలా ఉంటుంది?

ఒక గ్రామంలో ఒక గృహస్థుండే వాడు. ఆయన కొడుకులలో సుజ్జలు డనే వాడు వట్టి గడుగ్గాయి. వా డెప్పుడూ ఏవో పనికి మాలిన ఆటలాడుతూండే వాడు. రాత్రివేళ కూడా పిల్లులనూ, కుక్కలనూ తరుముతూ ఇల్లంతా తిరిగే వాడు. ఆఖరుకు ఎలుకల తోనూ, పందికొక్కులతోనూ కూడా వాడు ఆటలాడే వాడు. చీకట్లో తిరిగే వాడు; పాములూ, తేళ్ళూ ఉంటాయని పెద్దవాళ్ళు చెప్పినా వాడు వినిపించుకునే వాడు కాడు. పడి, దెబ్బలు తగిలించుకునే వాడు. వాడికి అపాయమంటే లక్ష్యం లేదు, భయమన్నది ఎరగనే ఎరగడు.

సుజ్జలుడు ఎందుకూ పనికి రాకుండా పోతున్నాడన్న చింత తండ్రిని చాలా బాధించింది. ఆయన వాణ్ణి తీసుకుపోయి ఒక గురువు దగ్గిరపెట్టి, వాణ్ణొక మనిషిని చేస్తే రెట్టింపు గురుకట్నం ఇచ్చుకుంటానన్నాడు. గురువుగారు వాణ్ణి నయానా, భయానా చదివించాలని ఎంతో ప్రయత్నించి విఫలుడై, "ఒరే, నీ బుర్రలో అన్నీ ఉన్నాయిగాని, భయమన్నది లేదురా! అది ఉంటే గాని నీవు రాణించవు," అన్నాడు.

"భయం ఎలా ఉంటుందో, ఎక్కడ ఉంటుందో చెప్పండి, తెచ్చుకుంటాను," అన్నాడు సుజ్జలుడు.

"భయం ఎలా ఉంటుందో నీకు తెలియజేస్తాలే!" అని గురువుగారు ఆ రాత్రి కంబళి కప్పుకుని భయంకరమైన అరుపులు అరుస్తూ సుజ్జలుడు నిద్రపోయే చోటికి వచ్చాడు. సుజ్జలు డా ధ్వనికి నిద్రలేచి, "ఎవరు నువ్వు?" అని అడిగాడు.

"దయ్యాన్ని! నిన్ను మింగేస్తా!" అన్నాడు గురువు.

"ఓహో, అందరూ దయ్యమనేది నిన్నేనా? మరి నీ నోరే కనిపించటం లేదే?

ఎస్. చలపతిరావు



ఎలా నన్ను మింగుతావు?" అని సుజ్జలు డడిగాడు. గురువు నిర్ఘాంతపోయాడు. సుజ్జలుడు కొంచెమైనా భయపడలేదు. మీదు మిక్కిలి వాడు దయ్యంతో, "నన్ను మింగితే నీకు సయించను. మా గురువు గారిని లేపి నీకింత అన్నం పెట్టిస్తా. ఆ తరవాత నాతో ఆడుకుంటావా, దయ్యమా?" అని అడిగాడు.

వాడు తనను సమీపించి చెయ్యి పట్టుకో బోతుంటే గురువుగారు పరిగెత్తబోయి పడ్డాడు. సుజ్జలు డాయనను లేవదీసి, "మీరా? ఈ ఆట బాగుందే!" అన్నాడు. మర్నాటి ఉదయం గురువుగారు సుజ్జలుణ్ణి తండ్రికి అప్పగించి, "మీ వాడికి భయం తెలీదు. వాడికి చదువు చెప్పటం నా వల్ల కాదు," అన్నాడు.

తండ్రి సుజ్జలుడికి కొంత డబ్బిచ్చి, "నువు వెళ్ళి ఎక్కడైనా తిరుగు, ఏమైనా చెయ్యి. ప్రయోజకుడివైన తరవాతనే ఇంటికి తిరిగి రా. అంతదాకా రాకు!" అని వాణ్ణి ఇంటి నుంచి పంపేశాడు.

సుజ్జలుడు ఇంటి నుంచి బయలుదేరి అరణ్యమార్గాన పోతూ కొందరు వేట గాళ్ళను చూశాడు. వాళ్ళకి పులి కనబడింది గాని అది ఎత్తయిన గడ్డిలో దూరి దాక్కున్నది. వాళ్ళకు ఎటు వెళ్ళటానికీ తెలియ లేదు. "ఎటుగా వచ్చి మీద పడుతుందో నని భయం!" అన్నా డొకడు.

సుజ్జలు డా మాట విని, "భయమా? ఎక్కడుంది? నాకు కాస్త చూపండి," అని వేటగాళ్ళతో అన్నాడు.

"అదుగో, ఆ కనిపించే గుహలో నీకు కావలిసినంత భయం ఉంది, చూసుకో!" అన్నారు వేటగాళ్ళు. సుజ్జలుడు ఆత్రంగా వాళ్ళు చూపించిన కొండ గుహ కేసి వెళ్ళి, అక్కడ రెండు పులి పిల్లలను చూసి, "ఎంత పెద్ద పిల్లులో! వీటినేనా భయ మంటారు?" అనుకున్నాడు. వాడు ఒక

పులిపిల్లను ఎత్తుకుని గుహ నుంచి బయటికి వచ్చి, ఒక తీగను తెంపి దాని మెడకు తాడులాగా కట్టి, దాన్ని నడిపించ సాగాడు.

"ఏమిరా వీడి ధైర్యం!" అని వేటగాళ్ళు వాడి చుట్టూ మూగారు.

"ఇదేనా భయమంటే?" అని సుజ్జలుడు వాళ్ళను అడిగాడు.

"ఇదే మా కందరికీ భయం. కాని దీని బాబు వచ్చినా నీకు మాత్రం భయమంటూ లేదు. పద, దీన్ని తీసుకుపోయి రాజుగారి కిచ్చి బహుమానం పుచ్చుకో!" అన్నారు వేటగాళ్ళు.

రాజుగారు పులి పిల్లను తీసుకుని సుజ్జలుడికి బహుమానం ఇచ్చాడు. రాజోద్యోగులు వాణ్ణి విందుకు పిలిచి, వాడి సమాచారమంతా తెలుసుకున్నారు. "నేను భయం కోసం వెతుకుతున్నాను. అది నాకింకా దొరకకుండా ఉన్నది," అన్నాడు సుజ్జలుడు వాళ్ళతో.

ఆస్థానంలో ఉండే వస్తాదు వాడితో, "భయాన్ని నేను చూపిస్తాను, నా వెంట రా!" అని, సుజ్జలుణ్ణి మరొక వస్తాదు ఇంటికి తీసుకు పోయాడు. ఈ వస్తాదు మరొక దేశం నుంచి వచ్చి ఆ దేశంలో ఉన్న గొప్ప వస్తాదుల నందరినీ ఓడించాడు.



సాయంకాలం చల్లగాలికి ఆ వస్తాదూ, అతని కూతురూ ఇంటి ముందు కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. ఆస్థానంలో ఉండే వస్తాదు సుజ్జలుడి కా వస్తాదును అంత దూరం నుంచే చూపి, "నువు వెళ్ళి వాడి రొమ్ము మీద గట్టిగా మూడు గుద్దులు గుద్దావంటే భయం ఎలా ఉంటుందో వాడే నీకు చూపిస్తాడు," అన్నాడు.

భయాన్ని చూసే అవకాశం దొరికిన సంతోషంతో సుజ్జలుడు పరదేశి వస్తాదును సమీపించి, "కాస్త లేచి నిలబడతారా?" అని అడిగాడు. వస్తాదు లేచి నిలబడ్డాడు. వెంటనే సుజ్జలుడు అతని రొమ్ము మీద

దభీ, దభీమని మూడుసార్లు గుద్దాడు. ఆ దెబ్బలకు వస్తాదు వెనక్కు పడిపోయాడు. వాడు పళ్ళు పటపట కొరుకుతూ సుజ్జలుడి గొంతు పట్టుకుని పిసికెయ్యబోయాడు. కాని అతని కూతురు అడ్డు వచ్చి, "ఊరుకో, నాన్నా! వెల్లికిలా పడి నువు ఓడిపోయావు. ఇంకా కసి దేనికి? అన్యాయం చెయ్య గూడదు!" అన్నది.

"వీడు నన్ను న్యాయంగా గెలిచాడా?" అన్నాడు వస్తాదు.

"అయ్యా, నేను నిన్ను గెలవటానికి రాలేదు. భయం ఎలా ఉంటుందో తెలుసు కోవటానికి వచ్చాను," అన్నాడు సుజ్జలుడు.

"అంత ధైర్యం గలవాడివా? ఈసారి కొట్టు చూస్తాం?" అన్నాడు వస్తాదు.

ధనామని అతని రొమ్ములో మళ్ళీ కొట్టాడు సుజ్జలుడు.

వస్తాదును కూతురు చెయ్యి పట్టి లోపలికి తీసుకుపోయి, "నీకు బలం ఉండవచ్చు గాక, అతని కున్న ధైర్యంలో నీకు సగం లేదు. అతను నీకు అల్లు డవుతాడేమో కనుక్కో!" అన్నది.

వస్తాదు పెద్దగా నవ్వి, "అదా సంగతి?" అంటూ బయటికి వచ్చి, "మా అమ్మాయి నీకు భయం ఏమిటో చెబుతుందిట, పెళ్ళాడతావా ఏమిటి?" అని సుజ్జలుణ్ణి అడిగాడు. సుజ్జలుడు సరే నన్నాడు. ఇద్దరికీ పెళ్ళి అయింది.

సుజ్జలుడు తన భార్యతో, "భయం ఎలా ఉంటుందో చూపిస్తానంటివే? ఏదీ?" అని అడిగాడు.

"ఇప్పుడే చూపుతాను," అంటూ ఆమె బయటికి వెళ్ళి ఒక కప్పను తెచ్చి అతని మీద పడేసింది.

సుజ్జలుడు ఉలిక్కిపడి, "బాబోయ్!" అంటూ కేక పెట్టాడు.

"అదే భయం!" అన్నది సుజ్జలుడి భార్య నవ్వుతూ.





# తండ్రి కోసం

ఒకప్పుడు గాంధార దేశాన్ని ధన్వంతుడనే రాజు పాలించేవాడు. ఒకనా డాయన సపరివారంగా అరణ్యానికి వేటాడబోయి, అక్కడ ఒక పుష్ప వృక్షం కింద నిలబడి ఉన్న ఒక అతిలోక సుందరిని చూశాడు. వెంటనే రాజు కామెపై మోహవికారం కలిగింది. తన పరివారాన్ని దూరంగా ఉండమని చెప్పి ధన్వంతుడు ఒంటరిగా ఆ స్త్రీని సమీపించి, "ఎవరు నీవు? ఈ అరణ్యంలో ఒంటరిగా ఎందుకున్నావు?" అని అడిగాడు.

"నే నొక గంధర్వ స్త్రీని. ఆకాశమార్గాన వెళుతూ, ఈ చెట్టు పూల వాసన ఆకర్షించగా, కిందికి దిగి వచ్చి చెట్టు కింద నిలబడ్డాను," అని ఆమె జవాబు చెప్పింది.

"నీవు మీ లోకానికి తిరిగి పోవద్దు. నా వెంట వచ్చి మా అంతఃపురంలో ఉండిపోయి, నాకు ఆనందం కలిగించు," అన్నాడు రాజు.

గంధర్వ స్త్రీ అందుకు ఒప్పుకోలేదు. రాజు మరింత ప్రాధేయ పడసాగాడు. చివరకామె చిరాకుపడి, "నీ కళ్ళు నీ బుద్ధిని పాడు చేసేశాయి. గంధర్వ స్త్రీనని చెప్పినా అర్థం చేసుకోలేకుండా ఉన్నావు గనక గుడ్డివాడివైపో!" అని శపించి, ఆకాశంలోకి ఎగిరి పోయింది.

గుడ్డివాడై పోయిన ధన్వంతుణ్ణి ఆయన పరివారం ఇల్లు చేర్చారు. ఆయన అంధత్వానికి ఎన్ని చికిత్సలు చేసినా ప్రయోజనం లేక పోయింది. శాపంవల్ల వచ్చిన గుడ్డితనం శాపవిమోచనంతో గాని పోదు. ఎవరైనా ఆ గంధర్వ స్త్రీ వద్దకు వెళ్ళి, ఆమె అనుగ్రహం సంపాదించి రాజును అంధత్వం నుంచి విముక్తుణ్ణి చెయ్యాలి. కాని ఈ పని ఎవరి వల్ల సాధ్య మవుతుంది?

ధన్వంతుడికి ఒకే ఒక కొడుకున్నాడు. అతని పేరు నిరంజనుడు. "నేను ఎంత

టి. కుమారస్వామి



శ్రమ అయినా పడి గంధర్వలోకానికి వెళ్ళి, తండ్రిగారిని శపించిన గంధర్వ స్త్రీ ఎవరో తెలుసుకుని, ఎలాగైనా ఆమెను సుముఖు రాలిని చేసుకుని, తండ్రిగారి అంధత్వం పోగొట్టే ఉపాయం తెలుసుకుని, తిరిగి వస్తాను," అని నిరంజనుడు బయలు దేరాడు. ఇది అసాధ్యమని ఎంతమంది చెప్పినా అతను వినలేదు.

గంధర్వలోకం ఈశాన్య దిశగా ఉన్నదని అందరూ అనేవారు. అందుచేత అతను అదే దిక్కుగా చాలా కాలం ప్రయాణించి, ఎటూ దారి లేని ప్రాంతానికి చేరాడు. ఎక్కడా మనుషులు లేరు. తినటాని కేమీ లేదు. ఆకలితో శోషిల్లి నిరంజనుడు ఒక చెట్టు కింద పడుకున్నాడు.

తిరిగి స్పృహ తెలిసేసరికి ఒక వికారా కారం గల స్త్రీ అతని పక్కన కూర్చుని అతని చేత పళ్ళు ఏవో తినిపిస్తున్నది.

"నే నొక పిశాచిని. ఈ చెట్టు పైన ఉంటాను. ఈ రోజు నీవు నా అతిథిగా వచ్చావు. అందుచేత నాకు చేతనైనట్టుగా అతిథి సత్కారం చేస్తున్నాను. ఎవరూ ఇటుగా రారు. నీ వెందుకు వచ్చావు?" అని ఆ స్త్రీ నిరంజనుణ్ణి అడిగింది.

నిరంజనుడు తన కథ అంతా పిశాచికి చెప్పి, "ఆకలితో పడిపోయిన నాకు తిండి పెట్టి కాపాడావు. గంధర్వలోకానికి దారి కూడా చెప్పావంటే నా కింకేమీ అవసరం లేదు," అన్నాడు.

"ఇక్కడి నుంచి గంధర్వలోకానికి వెళ్ళే దారి ఆకాశమార్గమే. నీ కది సాధ్యంకాదే!" అన్నది పిశాచి.

"ఎంత అసాధ్యమైనా వెళ్ళి తీరాలిసిందే గాని, వెనక్కు తిరిగి పోవటానికి లేదు," అన్నాడు నిరంజనుడు.

"నేను నిన్ను గంధర్వలోక ద్వారం దాకా తీసుకు పోగలను. లోపల ప్రవేశించటం నాకు సాధ్యంకాదు," అన్నది పిశాచి.

"ఆ పని చేస్తివా, నేను నీకు బతికి నంత కాలం ఎంతైనా ఋణపడి ఉంటాను," అన్నాడు నిరంజనుడు.

"నా కోరిక ఒక్కటి తీర్చేస్తే ఆ ఋణం యావత్తూ తీరిపోతుంది. ఏమంటావు?" అన్నది పిశాచి.

"నాకు సాధ్యమైనదైతే నీ కోరిక తప్పక తీరుస్తాను," అన్నాడు నిరంజనుడు.

"నీకు సాధ్యం కానిదైతే నేను కోరు తానా?" అంటూ పిశాచి నిరంజనుణ్ణి కళ్ళు మూసుకోమన్నది.

అతను తిరిగి కళ్ళు తెరిచేసరికి గంధర్వ లోక ద్వారం వద్ద ఉన్నాడు. పిశాచి ఒక మబ్బు తిన్నెపైన కూర్చుని, "నీవు తిరిగి వచ్చేదాకా ఇక్కడే ఉంటాను. నీ పని పూర్తి చేసుకుని రా. తరవాత నిన్ను మీ దేశం చేర్చుతాను," అన్నది.

అతను గంధర్వలోకంలోకి అడుగు పెట్ట గానే అనేకమంది గంధర్వ కాంత లతన్ని చుట్టుముట్టి, "ఎంత అందంగా ఉన్నాడో! ఎవతె పిలిపించిందో!" అనుకున్నారు. కొందరతన్ని, "నీకేం కావాలి? ఎవరు కావాలి?" అని అడిగారు.

"నా కొక గంధర్వ స్త్రీతో పని ఉన్నది. ఆమె ఇటీవల భూలోకానికి వచ్చి, మా



తండ్రిగారిని గుడ్డివాడివి కమ్మని శపించింది. ఆమె పేరు నాకు తెలియదు," అన్నాడు నిరంజనుడు.

గంధర్వకాంతలు తమలో తాము మాట్లాడుకుని, నిరంజనుడి తండ్రిని శపించి నది గంధర్వరాజ కుమార్తె పుష్పోత్తమ అయి ఉంటుందని నిశ్చయించి, అతన్ని ఆమె వద్దకు తీసుకుపోయారు.

"నీవా రాజు కొడుకువా? అతన్ని నేనే శపించాను. నన్ను తన అంతఃపురంలో ఉండమని చాలా అవమానించాడు. అందుకని నీవు ఇంత దూరం వచ్చావా?" అన్నది పుష్పోత్తమ.



" అమ్మా, మీరు మా తండ్రిగారిని సరిగా అర్థం చేసుకోలేదు. ఆయన మీ మీది గౌరవంతోనే అలా కోరారు; మిమ్మవమానించటానికి కాదు. దయ ఉంచి మీ శాపాన్ని ఉపసంహరించి ఆయనకు దృష్టి ప్రసాదించండి," అన్నాడు నిరంజనుడు.

పుష్పోత్తమ అతని కొక పువ్విస్తూ, " ఈ పుష్పాన్ని నీ తండ్రి కళ్ళకు తగిలిస్తే అంధత్వం పోతుంది. కాని ఈ పుష్పాన్ని నీ తండ్రి కంటికి తగిలించే వాడు ఆడి తప్పని వాడుగా ఉండాలి. ఆ మనిషి ఆడి తప్పిన పక్షంలో మీ తండ్రి తిరిగి గుడ్డివాడై పోతాడు," అన్నది.

నిరంజనుడా పుష్పాన్ని తీసుకుని, పుష్పోత్తమ వద్ద సెలవు పుచ్చుకుని, గంధర్వలోక ద్వారం దాటి, పిశాచి ఉన్న చోటికి తిరిగి వచ్చాడు. ఆమె ఒక్క క్షణంలో అతన్ని గాంధార దేశంలో అతని ఇంటి వద్ద చేర్చి, " రాజకుమారా, నీకు నావల్ల కావలిసిన సహాయం అయిపోయింది. నా కోరిక తీరుస్తానన్నావు. నన్ను పెళ్ళాడు—అదే నా కోరిక," అన్నది.

నిరంజనుడు, " సరే, నేను త్వరలోనే తిరిగివస్తాను. ఇక్కడే ఉండు," అని రాజ భవనంలోకి వెళ్ళి, గంధర్వ స్త్రీ ఇచ్చిన పుష్పాన్ని తన తండ్రి కళ్ళకు తాకించాడు. వెంటనే రాజుకు యథాప్రకారం దృష్టి వచ్చేసింది.

తరవాత నిరంజనుడు తన తండ్రికీ, మంత్రులకూ పిశాచి సంగతి చెప్పి, ఆమెను వివాహమాడతా నన్నాడు.

" వద్దురా, బాబూ! ఏమైనా సరే, మాట ఇచ్చాను గదా అని నీవా పిశాచిని పెళ్ళాడకు," అన్నాడు రాజు.

" అన్న మాట తప్పితే మీకు తిరిగి అంధత్వం వచ్చేస్తుంది. నేను పడిన శ్రమ అంతా వృథా అయిపోతుంది," అన్నాడు నిరంజనుడు.

"నీవు పిశాచిని పెళ్ళాడే కన్న నేను ఇలా గుడ్డివాణ్ణిగా ఉండటమే నయం," అన్నాడు రాజు.

"కాని ఆడిన మాట తప్పటం కంటె పిశాచిని పెళ్ళాడటమే నయం!" అన్నాడు నిరంజనుడు.

అతను పిశాచి వద్దకు తిరిగివచ్చి, "నేను నిన్ను పెళ్ళాడి నీ కోరిక తీరుస్తాను. కాని నీవు మాత్రం ఎవరికీ కనబడకుండా ఒక ఇంట దాగి ఉండాలి. నిన్ను చూస్తే అందరూ దడుచుకుంటారు!" అన్నాడు.

"నన్ను పాణిగ్రహణం చేసుకున్న తరవాత నీ వెలా ఉండమంటే అలా ఉంటాను," అన్నది పిశాచి.

నిరంజనుడు లాంఛనప్రాయంగా ఆమె చెయ్యి పట్టుకున్నాడు. మరుక్షణమే పిశాచి మాయమై ఒక అందమైన రాజకన్య అక్కడ నిలబడింది. "ఏమిటీ వింత?" అని నిరంజను డడిగాడు.

"నేను వత్సదేశపు రాజకుమార్తెను. నా పేరు సౌరభ. ఒకసారి ఒక ముసలి యోగి మా ఇంటికి వచ్చాడు. మా తండ్రి నన్నాయన శుశ్రూషకు నియోగించాడు. ఆ యోగికి నన్ను పెళ్ళాడాలని కోరిక కలిగి నా తండ్రితో చెప్పాడు. మా తండ్రి యోగికి భయపడి సరే నన్నాడు, కాని నేను మాత్రం ఆ ముసలివాణ్ణి పెళ్ళాడటానికి ఒప్పుకో లేదు. యోగి అలిగి నన్ను వికారాకారం గల పిశాచం కమ్మని శపించాడు. నా తండ్రి కాళ్ళు పట్టుకుని బతిమాలిన మీదట, నన్నెవడైనా ఆ వికారరూపంలో పెళ్ళాడటానికి సమ్మతించి పాణిగ్రహణం చేస్తే శాపవిముక్తి కలిగేటట్టు అనుగ్రహించాడు. ఇంతకాలానికి నీ మూలంగా నాకు శాప విమోచనం జరిగింది," అన్న దామె.

నిరంజనుడి భార్య పిశాచం కానందుకు అందరూ ఎంతో సంతోషించారు. వారి పెళ్ళి ఎంతో వైభవంగా జరిగింది.





# భట్రాజు యుక్తి

ఒక గ్రామంలో వెంకన్నభట్టు అనే భట్రాజుండే వాడు. అతను చాలా చాకచక్యం గల వాడు. గ్రామంలో ఎక్కడ ఏ శుభ కార్యం జరిగినా వెళ్ళి, అక్కడి వారిని పొగడుతూ పద్యాలు చెప్పి, వా రిచ్చిన బహుమానాలు పుచ్చుకుని జీవనం గడుపుతూ ఉండే వాడు.

ఊళ్ళో అందరూ అతనికి అంతో ఇంతో ముట్టజెప్పే వారే గాని, ఆ వూరి జమీందారు మాత్రం ఏనాడూ వెంకన్నభట్టు చేతిలో ఎర్రని ఏగానీ పెట్టిన పాపాన పోలేదు. జమీందారుగారింట శుభకార్యం జరిగినప్పుడల్లా వెంకన్నభట్టు వెళ్ళి పద్యాలు చదువుతూనే ఉండే వాడు. కాని పిసినిగొట్టు జమీందారు ప్రతిసారీ, "ఆహా, ఎంత చక్కని పద్యాలు చెప్పావు! ఇందుకుగాను నీకు మంచి ఈనాం ఇవ్వాలి. వచ్చే శుభ కార్యానికి కనపడు," అనే వాడు. ఇలా ఎన్నో శుభకార్యాలు జరిగాయి కాని వెంకన్న భట్టు కేమీ ముట్టలేదు.

ఇంతలో జమీందారుగారి కూతురి వివాహం వచ్చింది. ఈసారి అయినా జమీందారు వద్ద నుంచి మంచి బహుమానం పొందితీరాలని వెంకన్నభట్టు నిశ్చయించుకున్నాడు. అతనికి పాడి లేకపోవటం పెద్ద కొరతగా ఉంటూ వచ్చింది. ఈ పెళ్ళి సందర్భంలో ఎలాగయినా జమీందారు నుంచి ఒక మంచి పాడి ఆవును బహుమానంగా పుచ్చుకోవాలని వెంకన్నభట్టు ఆలోచించాడు.

అతను పెళ్ళి ఇంటికి, జమీందారుగారు బంధుమిత్రులతో ఉండగా వెళ్ళి, జమీందారును పొగడుతూ, వధూవరులను దీవిస్తూ పద్యాలు చదివి, "ధర్మదాతలు! ఈసారి తప్పక మంచి ఈనాం ఇప్పిస్తానన్నారు. అది దయ చేయింపించండి!" అన్నాడు.

ఎ. సరస్వతి బాబురావ్

బంధు మిత్రుల మధ్య ఈనాం ఇవ్వ కుండా తప్పించుకోవటానికి వీల్లేని పరిస్థితి ఏర్పడటం చేత జమీందారు, "ఏ మివ్వ మన్నావు?" అన్నాడు.

"పిల్లలు గల వాణ్ణి. ఒక్క పాడి ఆవును దయ చేయించండి," అన్నాడు వెంకన్నభట్టు.

జమీందారు ఒక నౌకరును పిలిచి, వాడితో రహస్యంగా, "ఒక ముసలి ఆవును వెతికి పట్టుకొచ్చి వాడి కిచ్చెయ్యి," అని చెప్పాడు.

నౌకరు వెళ్ళి త్వరలోనే ఒక ముసలి ఆవును తెచ్చి జమీందారుగారి ఎదటపెట్టాడు. దాన్ని చూసి అతిథులందరూ ఆశ్చర్య పోయి, భట్రాజు ఏమంటాడోనని ఆత్రంగా ఎదురుచూడ సాగారు.

వెంకన్నభట్టు ఇరకాటంలో పడ్డాడు. ఆవును తీసుకోవటం బొత్తిగా నిష్ప్రయో జనం. తీసుకోనంటే జమీందారుగారిని అవ మానపరిచినట్టవుతుంది. అందుచేత ఆ ముసలి ఆవును తీసుకోకుండా ఉండ టానికి అత నొక యుక్తి పన్నాడు.

అతను ఆవు వద్దకు వెళ్ళి, దాని చెవిలో ఏదో చెప్పినట్టు చెప్పి, దాని మూతి దగ్గిర చెవిపెట్టి ఆలకిస్తున్నట్టు అభినయించ సాగాడు. అది చూసి అందరికీ అమిత ఆశ్చర్యం వేసింది.



జమీందారు వెటకారంగా, "ఆవుతో ఏదో గుసగుసలాడుతున్నా వేమిటి, వెంకన్నా?" అని అడిగాడు.

"ఏంలేదు, మహాప్రభో! నే నీ ఆవును, 'ఈన మోస్తావా?' అని అడిగాను," అన్నాడు వెంకన్నభట్టు.

"అదే మంటుంది?" అన్నాడు జమీందారు మరింత వేళాకోళంగా.

"అది ఏమంటుందంటే: 'నేను కృత యుగంలో మహిషాసురుడి వద్ద ఉండే దాన్ని. మహిషాసురుడు కాస్తా ఆదిశక్తి చేతిలో అంతమయాడు. కృతయుగం అంతమయినా కూడా నేను చావలేదు. త్రేతా యుగం వచ్చింది. రావణుడు పుట్టటమూ, రాముడి చేతిలో చావటమూ కూడా కళ్ళారా చూశాను. ఆ తరవాత ద్వాపరయుగంలో కంసుడు పుట్టాడు. కృష్ణుడు వచ్చి కంసుణ్ణి చంపటం కూడా కళ్ళారా చూశాను. అప్పటికీ నాకు చావు రాలేదు. అయితే నాకు దేని మీదా ఈనాడు భ్రాంతి లేదు. వైరాగ్యం కూడా ఏర్పడింది. కలియుగం వచ్చేసింది. ఇన్ని యుగాలు చూసిన దాన్ని పట్టుకుని ఈన మోస్తావా అని అడగటానికి నీకు సిగ్గు లేదా? నలుగురూ నన్ను చూసి నవ్వరా?' అంటున్నది, మహాప్రభో!" అన్నాడు వెంకన్న భట్టు. అతడి మాటలకు అక్కడ ఉన్న వారంతా గొల్లున నవ్వారు. పది మందిలోనూ జమీందారుకు బాగా తల వంపులయింది.

"చచ్చు వెధవా! మంచి పాడి ఆవును పట్టుకు రారా అంటే ముసలి ఆవును తెచ్చావా? వెళ్ళి, వెంటనే మంచి పాడి ఆవును పట్టుకు రా!" అని జమీందారు నౌకరు పైన నిప్పులు కక్కాడు.

నౌకరు ముసలి ఆవును తీసుకుపోయి మంచి పాడి ఆవును తీసుకు వచ్చాడు. వెంకన్నభట్టు జమీందారుగారి దానశీలత పైన మరికొన్ని పద్యాలు చదివి, ఆ ఆవును ఇంటికి తోలుకుపోయాడు.





# పాము కాటు

పాపన్న కొడుక్కు ఏడోమాసం నిండింది. ఒకనాడు మీనాక్షి బిడ్డకు నీళ్ళుపోసి అరుగు పైన పడుకోబెట్టి, బట్టలు ఆరవేస్తూండగా, పిల్లవాణ్ణి పాము కరిచింది. వాడు కెవ్వున అరిచి మైకంలో పడ్డాడు.

ఆ ప్రాంతాల పాములూ, మండ్రగబ్బలూ, తేళ్ళూ మొదలైన విష జంతువులు జాస్తి. అందుచేత అవి తరుచు మనుషులను కాటు వేసేవి. అలా కాటు తిన్న మనుషులకు మంత్రం వేసే ఆయన ఒకడు ఒక గ్రామంలో ఆశ్రమం ఏర్పాటు చేసుకుని ఉంటూ ఉండేవాడు. ఆ ఆశ్రమం పేరు నాగాశ్రమం.

పాపన్నా, మీనాక్షీ బిడ్డను తీసుకుని బండి ఎక్కి మంత్రం వేయించటానికి ఆ నాగాశ్రమానికి బయలుదేరారు.

దోవలో ఒక ఆడది బిడ్డను ఎత్తుకుని ఏడుస్తూ నడుస్తున్నది. ఆ ఆడది పాపన్న బండి చూసి ఆగి, "అయ్యా, నా బిడ్డకు పాము కరిచింది. నాగాశ్రమానికి పోవాలి. బండిలో ఎక్కనిస్తావా? త్వరగా పోతే బిడ్డ బతకవచ్చు," అన్నది.

"ఎక్కమ్మా! మేం కూడా అక్కడికే పోతున్నాం," అని పాపన్న ఆమెను కూడా బండిలో ఎక్కించుకున్నాడు. ఆమె స్పృహలేని తన బిడ్డతో సహా మీనాక్షి పక్కనే కూర్చున్నది.

నాగాశ్రమంలో దయ్యాలు పట్టినవాళ్ళూ, మూర్ఛలవాళ్ళూ, తేళ్ళు కుట్టినవాళ్ళూ, పాములు కరిచినవాళ్ళూ, వాళ్ళను తీసుకు వచ్చినవాళ్ళూ గుంపుగా ఉన్నారు. ఆశ్రమంలో ఉన్న నౌకరు ఒకరి తరవాత ఒకరిని లోపలికి పోనిస్తాడు.

ఆ నౌకరు పాపన్నను బాగా ఎరుగును. అందుచేత అతన్ని చూడగానే పలకరించి కుశల ప్రశ్నలు వేశాడు. వాళ్ళిద్దరూ ఏం

మాట్లాడుతారో విందామని మీనాక్షి, గుడ్డల్లో చుట్టి ఉంచిన తన కొడుకును బండిలోనే ఉంచి ఇవతలికి వచ్చింది.

పాపన్న బండిలో వచ్చిన ఆడమనిషి ఇదంతా చూసి, పాపన్నకు త్వరగా ప్రవేశం కలుగుతుందని గ్రహించుకుని, బిడ్డలను మార్చేసి, తన బిడ్డను మీనాక్షి బిడ్డ బట్టలలో చుట్టి బండిలో పెట్టేసి, మీనాక్షి కొడుకును తన బట్టలలో చుట్టేసి పట్టుకున్నది.

ఆమె అనుకున్నట్టే అయింది. లోపల ఉన్నవారెవరో బయటికి రాగానే నౌకరు పాపన్నను లోపలికి పోనిచ్చాడు. మీనాక్షి బండి దగ్గిరికి పరిగెత్తుకు వచ్చి ఆడమనిషి బిడ్డ ఉన్న బట్టలచుట్టను తీసుకుని ఆ బిడ్డ తన బిడ్డే అనుకుని పాపన్న వెంట ఆశ్రమం లోపలికి వెళ్ళింది.

మంత్రం వేసే ఆయన వాళ్ళు వచ్చిన పని అడిగాడు. పాపన్న తన కొడుక్కు ఉదయం పాము కరిచిందని చెప్పాడు. మంత్రం వేసే ఆయన పాపన్న పేరూ, బిడ్డ పేరూ, వారి జన్మ నక్షత్రాలూ తెలుసుకుని, మంత్రం వేసి, "ఇక మీరు ఇంటికి వెళ్ళ వచ్చు," అన్నాడు.

వాళ్ళు బయటికి రాగానే, వారి వెంట బండిలో ఎక్కి వచ్చిన ఆడమనిషి ఆత్రంగా ఎదురు వచ్చి, "అమ్మా, పొరపాటు జరి



గింది. మీరు లోపలికి నా బిడ్డను ఎత్తుకు వెళ్ళారు. ఏదీ? మంత్రం వేశారా? నా బిడ్డ బతికిందా?'' అని అడుగుతూ, తన బిడ్డ కోసం చేతులు చాచి, మీనాక్షి చేతిలోని బిడ్డను తీసుకున్నది.

ఈ మాటలు విని మీనాక్షి కంగారు పడింది. కాని పాపన్న మటుకు, తొందరలో బిడ్డలు మారిపోయారేమో ననుకుని, ''మంత్రం వేశారమ్మా. నీ బిడ్డ కేమీ భయం లేదు,'' అన్నాడు.

''నీ బిడ్డ మా బట్టల్లోకి ఎలా వచ్చిందీ?'' అని మీనాక్షి అడిగింది. ఆమె ఆ ఆడమనిషి చేతిలో నుంచి తన బిడ్డను తీసుకున్నది.

మీనాక్షి ప్రశ్నకు సమాధానం చెప్పకుండా ఆ ఆడమనిషి, ''పాపం, మీ బిడ్డకూడా తొందరగా మంత్రం వేయించుకోండమ్మా!'' అన్నది, వారి హితం కోరిన దానిలాగా.

''మా బట్టలు మా కిచ్చెయ్యి,'' అంటూ మీనాక్షి తన బిడ్డకు కప్పి ఉన్న బట్టలు తీసింది. మీనాక్షి బిడ్డ కళ్ళు తెరిచి, కాళ్ళూ చేతులూ ఆడించాడు.

ఆ ఆడమనిషి కూడా తన బిడ్డకు చుట్టి ఉన్న బట్టలు తీసింది. తన బిడ్డ ఇంకా పాముకాటు మగతలోనే ఉండటం చూసి ఆమె గుండె గుభేలుమన్నది.



ఆమె కంగారుతో అమాంతంగా పాపన్న కాళ్ళు పట్టుకుని, "బాబూ, నేను చేసిన పాపానికి మంచి ప్రాయశ్చితం జరిగింది. నా బిడ్డకు త్వరగా మంత్రం పడాలన్న దురుద్దేశంతో బిడ్డలను మార్చాను. మంత్రం వేసినా నా బిడ్డ కోలుకోలేదు. మంత్రం వెయ్యక పోయినా మీ బిడ్డ కోలుకున్నాడు. పాపిష్టిదాన్ని నా బిడ్డ ప్రాణాలు నిలువునా తీశాను!" అని శోకాలుపెట్టి కన్నీరు వరద లయేటట్టు ఏడవసాగింది.

పాపన్న ఆమె నోదార్చుతూ, "ఇలా జరగటాని కేదో కారణం ఉంటుంది. నువు భయపడకు. నీ బిడ్డకు మళ్ళీ మంత్రం వేయింతాం!" అన్నాడు.

అతను తనకు పరిచితుడైన నౌకరుతో చెప్పి ఆ ఆడమనిషి త్వరగా లోపలికి వెళ్ళే ఏర్పాటు చేశాడు.

ఆ నౌకరే పాపన్నతో అసలు రహస్యం చెప్పాడు. మంత్రం ఏ మనిషికని వేస్తే ఆ మనిషికే పని చేస్తుంది. మంత్రం వేసే ఆయన కా మనిషి ఎదురుగా ఉండాలన్న నియమమేమీ లేదు.

ఆ సంగతి ఆ ఆడమనిషికి తెలియదు. అందుకే అనవసరంగా కక్కుర్తి పడి నీచపు పనికి ఒడిగట్టింది.

కొద్ది సేపట్లో ఆ ఆడమనిషి తన బిడ్డకు కూడా మంత్రం వేయించుకుని బయటికి వచ్చింది. ఆమె బిడ్డ కూడా కళ్ళు తెరిచి ఆడుకుంటున్నది. ఆమె ఈ సారి పాపన్నకు తన పశ్చాత్తాపంతోబాటు కృతజ్ఞత కూడా చెప్పుకున్నది. ఎందుకంటే పాపన్న సహాయ పడకపోతే ఆమె త్వరగా లోపలికి వెళ్ళ గలిగి ఉండేది కాదు.

పాపన్న తిరుగు ప్రయాణంలో కూడా ఆమెను తన బండీలోనే ఎక్కించుకుని, ఆమెను ఆమె ఉండే గ్రామంలో ఆమె ఇంటి దగ్గిర దింపి, మీనాక్షితోనూ, పిల్లవాడితోనూ ఇంటికి వచ్చేశాడు.





# యుద్ధకాండ

ఈవిధంగా రావణుడి సభలో అనేకమంది రాక్షస ప్రముఖులు, "ఇప్పుడే వెళ్ళి రామలక్ష్మణులనూ, వానర సేననూ నాశనం చేస్తాం," అంటూ లేవటం చూసి, విభీషణుడు వారిని వారించి, కూర్చోమని, చేతులు మోడ్చి రావణుడితో ఇలా అన్నాడు:

"సామ దాన భేదోపాయాల వల్ల సాధ్యం కాని దాన్నే దండోపాయం ద్వారా సాధించాలని బుద్ధిమంతు లంటారు. ప్రమత్తులూ, దురాశాపరులూ, దైవోపహతులూ అయిన వారి పట్ల శాస్త్రీయంగా ప్రయోగిస్తే దండోపాయం ఫలిస్తుంది, లేకపోతే ఫలించదు. రాముడు అప్రమత్తుడు, బలవంతుడు. హనుమంతుడు సముద్రం దాటి, లంకకు వచ్చి చేసిన అద్భుత కార్యాలు చూస్తే దైవం రాముడికి అనుకూలంగా ఉన్నట్టు కూడా కనబడుతుంది. శత్రుబలాన్ని తక్కువ చేసి చూడవద్దు. రాముడు రాక్షసులకు చేసిన అపకారానికి ప్రతీకారంగా రావణేశ్వరుడు సీతను ఎత్తుకు వచ్చాడందామనుకున్నా, రాముడు తానై ఖరుడు మొదలైన రాక్షసులను చంపలేదు. వాళ్ళే పనిపెట్టుకుని అతని పైకి వెళ్ళారు. రాముడు ఆత్మరక్షణ కొరకు వారిని చంపవలిసి వచ్చింది. సీతను తీసుకు రావటం మనకే చేటు. ఆమెను తిరిగి రాముడి కివ్వటం మంచిది. నీ మేలు కోరి ఈ మాట చెబుతున్నాను. రాముడి బాణాలు లంకను సర్వనాశనం చెయ్యక ముందే సీతను రాముడి కిచ్చెయ్యి."



విభీషణు డీ మాట లనగానే రావణుడు సభ చాలించి తన ఇంటికి వెళ్ళిపోయాడు. విభీషణు మర్నాడు ఉదయం రావణుడి భవనానికి వెళ్లి, మంత్రులు తప్ప మరెవరూ లేని సమయంలో తన అన్నతో, "సీత వచ్చినది మొదలు అనేక దుశ్శకునాలు కనిపిస్తున్నాయి. ఈ సంగతి లంకలోని ప్రతి పురుషుడికీ, స్త్రీ కీ కూడా తెలుసును. మంత్రులు మాత్రం నీతో ఈ సంగతి చెప్పరు. అన్ని విషయాలూ చక్కగా ఆలోచించి న్యాయప్రకారం చెయ్యి," అన్నాడు.

రావణు డీ మాట విని కోపంచెంది, "నా కెవరి భయమూ లేదు. రాముడు సీతను పొందలేడు, దేవేంద్రుడు సహాయం వచ్చినా యుద్ధంలో నా ఎదట నిలవలేడు," అని చెప్పి విభీషణుణ్ణి పంపేశాడు.

తరువాత రావణుడు యుద్ధం గురించి తన మంత్రులతో ఆలోచించగోరి, తన రథాన్నెక్కి, సపరివారంగా సభా భవనానికి వెళ్ళి, రాక్షసుల నందరినీ పిలుచుకు రమ్మని దూతలను పంపాడు. దూతలు రాక్షసు లందరి ఇళ్ళకూ వెళ్ళి వేరువేరు పనులలో నిమగ్నులై ఉన్న రాక్షసులను పిలిచారు. వారందరూ వచ్చిన మీదట, రావణుడు విభీషణుణ్ణీ, శుకుణ్ణీ, ప్రహస్తుణ్ణీ ప్రత్యేక స్థానాలలో కూర్చోమని చెప్పి, ప్రహస్తుడితో, "మన రాక్షస సైనికులు లంకానగరాన్ని ఎప్పటి కన్న జాగ్రత్తగా రక్షించాలని చెప్పు," అన్నాడు.

ప్రహస్తుడు బయటికి వెళ్ళి తిరిగి వచ్చి, "సమస్త సైన్యమూ సంసిద్ధంగా ఉన్నది," అని చెప్పాడు.

"మీ సలహాతో ప్రారంభించిన ప్రతి పనీ సఫలమయింది. ఇప్పుడు కూడా మీ సహాయంతో నాకు జయం లభించి తీరుతుంది. ఇప్పుడున్న సమస్య ఏమిటో మీకు ముందే చెప్పాను. ఆరు మాసాలుగా నిద్రపోతూ ఉండటం చేత ఒక్క కుంభకర్ణుడికే చెప్ప



లేదు. అత నిప్పు డిక్కడ ఉన్నాడు. జన కుడి కుమార్తే, రాముడి భార్యా అయిన సీతను రాక్షసులుండే దండకారణ్యం నుంచి తెచ్చాను. ఎంత ప్రార్థించినా ఆమె నన్ను ప్రేమించటం లేదు. అలాటి సుందరి మూడు లోకాలలోనూ లేదు. ఆమె మూలాన నేను మోహావేశంతో దహించుకు పోతు న్నాను. రాముడు వచ్చి తనను రక్షిస్తాడేమో నన్న నమ్మకంతో సీత నన్ను ఒక సంవ త్సరం గడు వడిగింది. నేను సరే నన్నాను. రాముడు వానర సేనతో సముద్రం దాటి రావటం అసాధ్యం. కాని దాటి రాగలిగితే మన మేం చెయ్యాలి? ఎందుకంటే ఒక్క వానరుడు సముద్రం దాటి వచ్చి పెద్ద యుద్ధం చేసి పోయాడు. అందుచేత బాగా ఆలోచించండి. రాముడు వానర సేనతో సముద్రం అవతలి ఒడ్డున చేరి ఉన్నాడు. సీతను ఇచ్చేమాట అబద్ధం. రామలక్ష్మణు లను చంపే ఉపాయం చూడండి," అని రావణు డన్నాడు.

రావణు డన్న మాటలు విని కుంభ కర్ణుడు మండిపడుతూ, "మాతో ఈ ఆలో చన సీతను తీసుకు రాకపూర్వం చేసి ఉండ వలిసింది. ఏ పని చేసేటప్పుడైనా ముందు గానే చక్కగా ఆలోచిస్తే తరువాత పశ్చాత్తాప పడ నవసరముండదు. కొంచెంకూడా ఆలో చించకుండా సీతను అపహరించి తెచ్చావు. రాముడు నిన్నిదివరకే చంపక పోవటం అదృష్టం. ఈ స్థితిలో నీ శత్రువుల నంద రినీ చంపి నీ కార్యం నెరవేర్చే శక్తి గల వాణ్ణి నే నొక్కణ్ణే ఉన్నాను. నేనా పని చేస్తాను. అందుచేత నీవు నిశ్చింతగా ఉండు," అన్నాడు.

కుంభకర్ణుడి మాటలు రావణుడికి కోపం కలిగించాయి. ఆ సంగతి గ్రహించి మహా పార్శ్వుడనే రాక్షసుడు, "తేనె కోసం భయం కర మృగాలున్న వనంలో ప్రవేశించి తేనె సంపాదించుకున్న వాడు దాన్ని తాగకపోతే



వాడు వట్టి మూఢుడు. రావణా, అందరికీ నీవే ఈశ్వరుడవు, నిన్నడ్డగల వారెవరు? సీతను యథేచ్ఛగా అనుభవించు, ఆమె ఒప్పుకపోతే బలాత్కారంగానైనా అనుభవించు. నీ కోరిక తీరినాక ఏం వచ్చినా రానీ, నీవు అన్నిటినీ ఎదుర్కొ గలవు. దేవేంద్రుణ్ణి సయితం జయించగల వారు కుంభకర్ణుడూ, ఇంద్రజిత్తూ ఉండనే ఉన్నారు. సామదాన భేదాలన్నవి చేతగాని వారికి. నీవు దండోపాయంతోనే కార్యసిద్ధి పొందు," అన్నాడు.

ఈ మాట రావణుడికి నచ్చింది. అతను మహాపార్శ్వుడితో, "నన్ను గురించి ఒక రహస్యమున్నది. ఒకప్పుడు పుంజికస్థల అనేది బ్రహ్మదేవుడి ఇంటికి పోతూ ఉంటే చూసి దానిని బలాత్కారంగా చెరిచాను. ఆ సంగతి బ్రహ్మకు తెలిసిందట. ఆయన, అది మొదలు నేను ఏ పర స్త్రీని గాని బలాత్కారంగా అనుభవిస్తే నా తల నూరు ముక్కలవుతుందని శపించాడు. ఆ శాపానికి భయపడే నేను సీతను బలాత్కారంగా అనుభవించ లేదు. నాకు గల వేగమూ, గమనశక్తీ తెలియక రాముడు నా పైకి వస్తున్నాడు. గుహలో నిద్రపోయే సింహాన్ని లేపినట్టుగా మృత్యువులాటి నన్ను కవ్విస్తున్నాడు. నా బాణాల దెబ్బ ఎరగడు. ఇక తెలియజేస్తాను," అన్నాడు.

ఈ ధోరణిని విభీషణుడు సహించలేక తనకు తోచిన మాటలు నాలుగూ దులిపేశాడు. సీతను తీసుకురావటం అయిదు తలల విష సర్పాన్ని తెచ్చుకోవటమే నన్నాడు; రాముణ్ణి ఇంద్రజిత్తయేది, రావణుడయేది, ఎవరయేది జయించటం కల్ల అన్నాడు; రావణుడు తప్పు తోవను పోతుంటే మిగిలినవారు అతన్ని సరి అయిన మార్గానికి తిప్పటానికి బదులు ఇచ్చకాలాడుతున్నారన్నాడు: సీతను రాముడి వద్దకు పంపెయ్యటం అందరికీ క్షేమమని తేల్చాడు.

విభీషణుడు చెప్పిన ఈ మాటలకు ఇంద్రజిత్తు. "బాబాయీ, పులస్త్య వంశంలో పుట్టినవాడు అనరాని మాట లన్నావు. బల శౌర్య పరాక్రమాలు లేని పిరికి పందవు! ఎందుకు అందరినీ భయ పెట్టుతున్నావు? రామ లక్ష్మణులను చంప టానికి ఒక్క రాక్షసుడు చాలు. నేను ఇంద్రుణ్ణి ఓడించాను. నన్ను చూసి దేవ తలు గొర్రెల మందలాగా పారిపోయారు. ఐరావతాన్ని కూల్చి, దాని దంతాలు పెరి కాను. అల్పులైన ఈ రాజకుమారులను జయించలేనా?" అన్నాడు.

"నాయనా, కుర్రవాడివి. నీ బుద్ధి పరి పక్వం కాలేదు. నీ తండ్రి పక్షంగా మాట్లా డుతూ అతనికే శత్రుడివవుతున్నావు. ఈ సభలో నిన్ను మాట్లాడనివ్వటమే తప్పు. సీతను కానుకలతో సహా రాముడికి అర్పించి నట్టయితే మనమంతా సుఖంగా ఉండ వచ్చు," అని విభీషణు డన్నాడు.

ఈ మాట అన్నందుకు రావణుడు విభీషణుడి పై విరుచుకుపడ్డాడు. "జ్ఞాతివి, శత్రు పక్షపాతివి. జ్ఞాతి కన్న పగవాడు లేడు. తమ్ముడి వని క్షమించాను. మరొక డైతే చీల్చేసి ఉందును. ఛీ, వంశం చెడ బుట్టిన వాడా!" అన్నాడు.



రావణు డిలా చీదరించుకోగానే విభీష ణుడు మరి నలుగురు రాక్షస అనుచరులతో సహా ఆకాశంలోకి లేచి, "అన్న వని నీ మేలు కోరి చెప్పాను. నా మీద లేని తప్పు మోపి, నిందించావు. అది సహించరానిది. ఇష్టమైన మాటలు చెప్పేవారు కొల్లలు, కటువుగా ఉన్నప్పటికీ మేలు చేసే మాటలు చెప్పే వారు దొరకరు. నీవు రాముడి చేతిలో చావగా చూడలేను. నీ మంచి కోరి చెప్పిన మాటలను క్షమించు. నీవూ, లంకా, ఈ రాక్షసులూ క్షేమంగా ఉండేటట్టు చూచుకో. నేను పోతున్నాను. నీవు సుఖంగా ఉండు," అని చెప్పి, అక్కడి నుంచి బయలుదేరి



రామ లక్ష్మణులూ, వానరసేనా వున్న చోటికి క్షణంలో చేరుకున్నాడు.

ఆయుధాలు ధరించి ఆకాశమార్గాన అతి వేగంగా వస్తున్న విభీషణుణ్ణీ, అతని వెంట ఉన్న నలుగురు రాక్షసులనూ వానరులంతా చూశారు. సుగ్రీవుడు ఆ రాక్షసులను చూసి, క్షణం ఆలోచించి, హనుమంతుడు మొదలైన వారితో, "ఈ రాక్షసులు తప్పకుండా మనని చంపటానికే యిటు వస్తున్నారు, చూడండి!" అన్నాడు.

వెంటనే వానర ప్రముఖులు చెట్లనూ, శిలలనూ తీసుకుని, "ఈ దుర్మార్గులను చావగొట్టి కింద పడేస్తాం. వీళ్ళెంత?" అన్నారు. ఈలోపల విభీషణుడు తన అనుచరులతో సహా సముద్రపు ఉత్తర తీరాన్ని చేరి, ఆకాశంలోనే నిలబడి, సుగ్రీవుణ్ణీ, వానరులనూ చూసి ఇలా అన్నాడు:

"దుర్మార్గుడైన రాక్షస రాజు రావణుడనే వాడికి నేను తమ్ముణ్ణి. నన్ను విభీషణుడంటారు. అతను జటాయువును చంపి, దుఃఖితురాలూ, వివశురాలూ అయి ఉన్న సీతను జనస్థానం నుంచి ఎత్తుకు వచ్చి రాక్షస స్త్రీల రక్షణలో ఉంచాడు. సీతను రాముడికి తిరిగి ఇచ్చివెయ్యమని నయాన ఎన్నోసార్లు చెప్పాను. కాలం మూడిన రావణుడికి నా మాట రుచించింది కాదు. అందుచేత అతను నన్ను భృత్యుడిలాగా చూసి పరుష వాక్యాలన్నాడు. నేను భార్యా పుత్రులను సైతం విడిచిపెట్టి రాముడి శరణు వచ్చాను. నే నిలా వచ్చానని రాముడికి వెంటనే నివేదించండి."

ఈ మాటలు వింటూనే సుగ్రీవుడు లక్ష్మణుడి వెంట రాముడున్న చోటికి వెళ్ళి, "రావణుడి తమ్ముడు విభీషణుడట, నలుగురు రాక్షసులను వెంట బెట్టుకుని నిన్ను శరణు వేడ వచ్చాడు. కొంచెం జాగ్రత్తగా ఉండాలి. ఈ రాక్షసులను నమ్మరాదు; వారు కామరూపులు, శూరులు, అదృశ్యంగా

ఉండగలవారు, మాయావులు. ఇతను రావణుడి వేగులవాడుగా వచ్చి, మన విశ్వాసం సంపాదించి, మన మధ్య భేదాలు కలిగించవచ్చు; సందేహం లేదు. లేదా ఎప్పుడో ఒకప్పుడు ఇతనే మన మీద దెబ్బ తీయవచ్చు. మన శత్రువుకు తమ్ముడైన ఇతని నెలా నమ్మటం? రావణుడే ఇతన్ని పంపి ఉండవచ్చు. ఇతన్నీ, ఇతని అను చరులనూ వెంటనే చంపటం మంచిది," అని హెచ్చరించాడు.

రాముడు సుగ్రీవుడి సలహా విన్నమీదట హనుమంతుడు మొదలైన వానరప్రముఖుల కేసి చూసి, "సుగ్రీవుడు ఆలోచించి చెప్పిన మాట విన్నారుగదా. అలాగే మీరందరూ కూడా మీకు మీకు తోచిన సలహా లివ్వ వచ్చు," అన్నాడు.

విభీషణుడు ఎలాటి వాడయినదీ స్పష్టంగా తేల్చుకున్న మీదట అతనిని నమ్మటమో, మానటమో తేల్చుకుందామని అంగదు డన్నాడు. అతన్ని పరీక్షించటానికి సూక్ష్మ బుద్ధి గల చారుణ్ణి పంపుదామని శరభు డన్నాడు. విభీషణుడు ఇక్కడికి రావటమే అనుమానాస్పదంగా ఉన్నదని జాంబవంతు డన్నాడు.

హనుమంతుడు అందరి సలహాలనూ కొట్టి పారేశాడు. "విభీషణుడి మంచి చెడ్డలు విచారించటం ఎలా? సమీపంలో ఉన్న వాడి వద్దకు చారుణ్ణి ఎలా పంపటం? విభీషణుడు ఈ సమయంలో ఇక్కడికి రావటానికి తగిన కారణం ఉన్నది. రావణుడు దుర్మార్గుడని అతనికి తెలుసును. అలాగే రాముడు వాలిని చంపి సుగ్రీవుడికి రాజ్యాభిషేకం చేసిన సంగతికూడా అతనికి తెలుసును. అతను రాజ్యం కోరి బుద్ధి పూర్వకంగానే తన అన్నను వదిలి యిక్కడికి వచ్చాడు. ఇలా నాకు తోస్తున్నది. తరువాత నీ యిష్టం," అన్నాడు హనుమంతుడు రాముడితో.



# నేహ్రూ కథ



రెండున్నర శతాబ్దాల క్రితం, ఢిల్లీలో మొగలుల ప్రతిభ ఉడిగిపోతున్న కాలంలో, కాశ్మీరు దేశంలో రాజ్ కౌల్ అనే అయన ఉండేవాడు. సంస్కృత, పారసీక భాషలలో గొప్ప పండితుడుగా అయన కాశ్మీరులో ప్రసిద్ధి పొందాడు.

ఔరంగ్‌జేబ్ మరణించిన అనంతరం ఢిల్లీ సింహాసనానికి వచ్చిన ఫరుఖ్‌సియర్ కాశ్మీరుకు వెళ్ళినప్పుడు రాజ్ కౌల్ పాండిత్యం గురించి వినటం జరిగింది. అయన ప్రోత్సాహంతోనే కావచ్చు, 1716 ప్రాంతంలో రాజ్ కౌల్ సకుటుంబంగా కాశ్మీరు లోయను వదిలి ఢిల్లీకి తన నివాసం మార్చేశాడు.

ఢిల్లీలో రాజ్ కౌల్ ఒక జాగీరూ, ఒక కాలవ దరిన ఇల్లూ సంపాదించుకున్నాడు. కాలవను "నహర్" అంటారు. ఆ కాలవ మూలంగా అయన పేరులో "నేహ్రూ" చేరింది. కౌల్ అన్న వంశనామం కాస్తా కౌల్ - నేహ్రూ అయింది. రానురాను "కౌల్" అంతరించిపోయి, నేహ్రూ అన్న ఇంటి పేరే మిగిలింది.

రోజులు అస్తవ్యస్తంగా ఉండటంచేత నేహ్రూల కుటుంబం అనేక చిక్కులను ఎదుర్కొన్నది. క్రమంగా జాగీరు హరించిపోయింది. నామ మాత్రంగా నిలిచివున్న ఢిల్లీ చక్రవర్తి దర్బారులో లక్ష్మినారాయణ నేహ్రూ అనే అయన "సర్కారు కంపెనీ" తరఫున మొట్టమొదటి వకీలుగా పనిచేశాడు. ఈయనే జవాహర్లాలు ముత్తాతగారు. జవాహర్లాల్ తాతగారైన గంగాధర్ నేహ్రూ, 1857 సిపాయీల తిరుగుబాటుకు ముందు కొంతకాలం ఢిల్లీకి కొత్వాలుగా పనిచేసి, 1861 లో తన 34 వ ఏటనే చనిపోయాడు.

1857 తిరుగుబాటుతో నేహ్రూ కుటుంబానికీ ఢిల్లీకీ తెగతెంపులు జరిగాయి. వారి



కుటుంబ పత్రాలన్నీ అక్కడే పోయాయి. నేహ్రూ కుటుంబం దాదాపు తమ సర్వ స్వాన్నీ పోగొట్టుకుని, ఢిల్లీని విడిచి కాందిశీకులై వెళ్ళిపోయే అసంఖ్యాకులతోబాటు ఆగ్రాకు బయలుదేరారు.

అప్పటి కింకా మోతీలాల్ నేహ్రూ పుట్టలేదు, కాని ఆయన అన్న లిద్దరూ యువకులూ, కొంత ఆంగ్లభాషా జ్ఞానం కల వారూనూ. ఆ ఆంగ్లభాషా జ్ఞానమే వారి కుటుంబాన్ని విపత్తు నుంచి కాపాడింది.

మోతీలాల్ పెద్ద అన్న బన్సీధర్ నేహ్రూ, చిన్న అన్న నందలాల్ నేహ్రూ. ఈ నందలాల్ కొందరు బంధువులతో కలిసి ఢిల్లీ నుంచి ప్రయాణమై పోతున్నాడు. వారిలో అతని చెల్లెలుకూడా ఉన్నది. ఆమె అప్పటికి చిన్న పిల్ల, బాగా తెల్లగా ఉండేది.

ప్రయాణమై పోతున్న నందలాల్ మొదలైన వారికి కొందరు బ్రిటిషు సైనికులు ఎదురు వచ్చారు. వారా తెల్లపిల్లను చూసి ఆంగ్లేయుల పిల్ల అనుకుని, ఆమెను నందలాల్ ఎత్తుకుపోతున్నాడని ఆరోపించారు. ఆ తరుణంలో ఆరోపణ తరవాత విచారణా, శిక్షా క్షణాలపై జరిగేవి. నందలాల్ వారితో ఆంగ్లంలో సంభాషణ సాగించడంలో కొంత వ్యవధి లభించింది. ఈలోపుగా అతన్ని ఎరిగినవా రెవరో అటుగా వచ్చి అతన్ని కాపాడారు. లేకపోతే ఆనాడు నందలాల్ శవమూ, అతని బంధువుల శవాలూ అక్కడి చెట్లకు వేళ్ళాడి ఉండవలసిందే!

నేహ్రూలు కొన్ని సంవత్సరాల పాటు ఆగ్రాలోనే నివసించారు. 1861 మే 6 న, తన తండ్రి చనిపోయిన మూడు మాసాల అనంతరం, మోతీలాల్ నేహ్రూ ఆగ్రాలోనే జన్మించాడు. ఆ నాడే బెంగాలులో మహాకవి రవీంద్రనాథ టాగూరు కూడా జన్మించటం చాలా చిత్రం.

మోతీలాల్ కన్న అతని అన్నలు చాలా పెద్దవాళ్ళు కావటంచేత కుటుంబ భారం

వారి పైన పడింది. బన్సీధర్ త్వరలోనే బ్రిటిషు ప్రభుత్వ న్యాయశాఖలో చేరి, తరుచు బదిలీ అవుతూ, కొంతవరకు కుటుంబానికి దూరమై పోయాడు.

నందలాల్ రాజపుటానాలోని ఖేత్రీ సంస్థానంలో కొలువు కుదిరి అక్కడ పదేళ్ళపాటు దివానుగా పని చేశాడు. అటుపిమ్మట ఆయన "లా" చదివి, లాయరుగా ప్రాక్టీస్ పెట్టి ఆగ్రాలో స్థిరపడ్డాడు.

మోతీలాల్ ఈ అన్నగారి రక్షణలోనే పెరిగాడు. ఆ ఇద్దరి మధ్యా ఎంతో అన్యోన్యం ఉండేది. అందులో అన్నదమ్ముల కుండే అనురాగమే గాక, తండ్రి కొడుకుల మధ్య ఉండే ప్రేమ కూడా మిళితమై ఉండేది.

అలహాబాదులో హైకోర్టు వెలిసింది. దానితోబాటు నందలాల్ కూడా అలహాబాదు చేరుకుని, తన కుటుంబాన్ని ఆగ్రా నుంచి అక్కడికి తరలించాడు. అప్పటి నుంచీ నేహ్రూలకు అలహాబాదే స్వస్థలమయింది.

నందలాల్ నేహ్రూ ప్రాక్టీసు క్రమంగా పెరిగి, ఆయన అక్కడి అగ్ర గణ్యులైన లాయర్లలో ఒకడయాడు. ఈ లోపుగా మోతీలాల్ తన స్కూలు చదువూ, కాలేజీ చదువూ కాన్పూరు, అలహాబాదు నగరాలలో సాగించాడు. ఆయన పదేళ్ళదాకా



పారసీక, అరబ్బీ భాషలే నేర్చుకుని, ఆ తరవాత ఇంగ్లీషు నేర్చుకున్నాడు. కాని ఆ చిన్న వయసులోనే ఆయనకు పారసీక భాషలో పాండిత్యం ఉండేది, అరబ్బీ భాష కూడా కొంత తెలుసును; అందుచేత ఆయనను పెద్దవాళ్ళు కూడా గౌరవించేవారు.

అయితే ఆయన స్కూలు చదువూ, కాలేజీ చదువూ అంతగా రాణించలేదు. ఆయనకు చదువు మీదకన్న వ్యాయామ క్రీడల పైనా, ఆకతాయితనం పైనా ఆసక్తి జాస్తిగా ఉండేది. ఆయన బి. ఏ. పరీక్షకు వెళ్ళి ఒక పేపరు మాత్రమే రాసి, తప్పు తాననుకుని, మిగిలిన పరీక్షలు ఎగవేశాడు.

మోతీలాల్ కూడా అన్నగారి లాగే న్యాయ వ్యాది కావటానికి నిశ్చయించుకుని, హైకోర్టు వకీలు పరీక్షకు కూర్చుని అగ్ర శ్రేణిలో ఉత్తీర్ణుడయాడు. ఆయన కాన్పూరులో మూడేళ్ళు అప్రెంటిసు చేసి, అలహాబాదు హైకోర్టులో ప్రాక్టీసు ప్రారంభించాడు. అదే సమయంలో నందలాల్ ఆకస్మికంగా చని పోయాడు. ఆత్మీయుడూ, తండ్రిలాటివాడూ పోయాడన్న దుఃఖంతో బాటు కుటుంబ భారం కూడా మోతీలాల్ పైన పడింది.

ఆయన విజయం సాధించాలనే పట్టు దలతో దీక్షగా పని చెయ్యసాగాడు. ఆయనకు తన వృత్తి తప్ప ఇంకొక ఆలోచనే లేక పోయింది. అన్నగారి ఫైలు దాదాపు అంతా ఆయనకే వచ్చింది. అందులో విజయం లభించటంతో ఆయన కోరిక నెరవేరింది. ఆయన రాబడీ, పనీ కూడా జాస్తి అయాయి. చిన్నతనంలోనే గొప్ప లాయ రనిపించు కున్నందుకు ఆయన తన వృత్తికి దాసుడై పోయి, శలవులో కూడా పని చేశాడు. అప్పుడే నేషనల్ కాంగ్రెసు విద్యావంతు లైన మధ్యతరగతి వారిని ఆకర్షించ నారం భించింది. ఆయన కొన్ని సమావేశాలకు హాజరై, సిద్ధాంతరీత్యా కాంగ్రెసు నామో దించాడు, కాని అంతకు మించి పట్టించుకో లేదు. అదీగాక ఆయనకు రాజకీయాలలో అంతగా ప్రవేశం లేదు. దానికి తోడు తాను ముందుండని ఉద్యమాలలో పాల్గొనటం కూడా ఆయనకు రుచించేది కాదు.

అదీగాక ఆయనకు ఇంగ్లీషువారంటే కొంత గౌరవ భావం ఉండేది. ఆయన జాతీయాభిమానం గలవాడైనప్పటికీ, తన దేశ ప్రజలు భ్రష్టులై పోయారనీ, అందుకు వారే బాధ్యులనీ ఉండేది. ఏమీ చెయ్య కుండా అదే పనిగా మాట్లాడే రాజకీయవాదు లంటే ఆయనకు నిరసన కూడా ఉండేది. పనికిమాలిన వారే రాజకీయాలలో దిగుతా రని ఆయన నమ్మకం. —(ఇంకా వుంది)



# 32. అమెరికా పార్లమెంటు భవనం

యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా (యు. ఎస్. ఏ.) కు రాజధాని వాషింగ్టన్ నగరం. ఆ నగరంలోని పార్లమెంటు భవనాలు ప్రపంచంలోని అందమైన కట్టడాలలో ఒకటిగా ఎంచబడుతున్నవి. భవనం పైన 268 అడుగుల ఎత్తు గల గుమ్మటం ఉన్నది. ఈ భవనాన్ని చలువరాతితోనూ, తెల్ల రంగు వేసిన ఇసుకరాయితోనూ కట్టారు. ఈ భవనం కట్టటానికి 160 లక్షల డాలర్లు ఖర్చయింది.



Photo by P. R. Shinde



బహుమతి
పొందిన వ్యాఖ్య

విషమించిన మదీయ ఖేదం

పంపినవారు :
వై. హేమ, బొంబే

Photo by Kamal Jaiswal



బహుమతి
పొందిన వ్యాఖ్య

కుసుమించిన త్వదీయ మోదం

పంపినవారు:
వై. హేమ, బొంబే

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫొటోల వ్యాఖ్యలు 1964 సెప్టెంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జులై నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## జులై నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : విషమించిన మదీయ ఖేదం

రెండవ ఫోటో : కుసుమించిన త్వదీయ మోదం

పంపినవారు : వై. హేమ,

c/o శ్రీ కె. హెచ్. ఎం. రావు, ట్రాంబే, బాంబే—73

బహుమతి మొత్తం రు. 10/— ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3 Arcot Road, Madras-26. Controlling Editor : 'CHAKRAPANI'




## మీరూ అంగీకరిస్తారు



# టాటా-ఫిన్లే

# టీ

సాటిలేని టీ!

### తాజా టీ

తాజాగా వుంచుటకు టాటా-ఫిన్లే టీని ప్రత్యేకమైన ప్యాకింగ్‌లో సురక్షితముగా భద్రపరచుతారు.

### పరిమళమైన టీ

అతి సున్నితమైన పరిమళమిచ్చుటకు కావలసిన కోమలమైన ఆకులను మొగ్గలనే టాటా-ఫిన్లే టీలో ఉపయోగిస్తారు.

### ఉత్తమ టీ

టాటా-ఫిన్లే టీ మిశ్రణ (బ్లెండింగ్) అతి నిపుణతతో చేస్తారు. కనుకనే ఈ టీ చిక్కగా రుచికరంగా వుంటుంది.

**టాటా-ఫిన్లే టీ త్రాగండి;**
**ఆనందము అందుకోండి!**




ఈ క్రింది రకాలలోను, ప్యాకింగ్స్‌లోను టాటా-ఫిన్లే టీ దొరుకుతుంది:-
ప్రెస్టిజ్ డార్జిలింగ్-సుందరమైన టిన్
లలిత్-బంగారు రంగు ప్యాకెట్
మిలాప్-వెండి రంగు ప్యాకెట్
షాన్-నీలి రంగు ప్యాకెట్




I-TFN-5-TEL

# దిలీపు బృందం

## పిక్నిక్ వెళ్లారు



























JWTUC 1614




1. కస్తల శాంతకుమారి, నర్సరావుపేట

మామా, రామాయణంలో యుద్ధకాండ అంతా పూర్తవుతే ఉత్తర రామాయణం లవ కుశుల చరిత్ర కూడా ప్రచురిస్తారా?

ప్రచురిస్తాం.

2. యస్. రాజేశ్వరరావు, డోర్నకల్లు

అన్నయ్యా, అక్బరు కొడుకు మురాద్ దాడిని 1576 లో చాంద్ బీబీ ప్రతిఘటించింది అని "భారతచరిత్ర" లో ఉన్నది. కాని ఇంతవరకు చరిత్రలో షాజహాను కొడుకు మురాద్ అని చదివాం. ఈ విషయ మేమిటో వివరిస్తారా?

మురాద్ అనే పేరు గల కొడుకు షాజహానుకు కూడా ఉన్నాడు. కాని ఆ మురాద్ 1576 లో పుట్టనుకూడా లేదు; చాంద్ బీబీ అతనితో యుద్ధమూ చెయ్యలేదు. ఈ మురాద్ అక్బరు కొడుకే.

3. గోపాలుని శ్రీహరిరావు, ఊటుకూరు

ఫొటో వ్యాఖ్యలకు కార్డులే నిర్ణయించడములో మీ అభిప్రాయము ఏమి?

మాకు వ్యాఖ్యలు పరిశీలించటం తేలిక, మీకు ఖర్చు తక్కువ.

4. కుమారి సి. వి. వసుంధరాదేవి, వాయల్పాడు

అన్నయ్యా, బిగ్‌బెన్ [మే] ముఖం ఎత్తు 23′ అనియు, నిమిషాల ముల్లు 14′ అనియు తెలిపియున్నారు. నిమిషాల ముల్లు 14′ అయిన దీని ముఖం 28′ ఎత్తు ఉండవలయును కదా?

అవసరం లేదు. బిగ్ బెన్ బొమ్మలో నిమిషాల ముల్లును జాగ్రత్తగా గమనించినట్టయితే, దాని లోపలి కొస ముఖం యొక్క కేంద్రాన్ని అధిగమించి ఉండటం స్పష్టంగా తెలుస్తుంది.

5. చెన్నూరి నాగభూషణరావు, హైదరాబాదు

అన్నయ్యా, జూన్ నెల "చందమామ" [యుద్ధకాండ] లో "బ్రహ్మాండమైన రాళ్ళు విసిరే యంత్రా లున్నాయి, నూరేసి మందిని చంపగల శతఘ్నులున్నాయి" అని వ్రాసినారు. త్రేతాయుగంలో కూడా అలాటి యంత్రా లుండేవా?

రాళ్ళు విసిరే యంత్రం కనిపెట్టబడింది క్రీస్తు పూర్వం 399 లో నని తెలుస్తున్నది. వాల్మీకికి గాని, ఈ విషయాన్ని రామాయణంలో ప్రక్షిప్తం చేసిన వారికి గాని ఈ యంత్రాల మాట తెలిసి ఉండాలి. శతఘ్ని అంటే ఈ నాటి పేలుడు ఫిరంగి కానవసరం లేదు; నూరుమందిని చంప గలది శతఘ్ని.

6. పి. రాజగోపాల్, విజయవాడ

మామా, శ్రీ వి. ఆర్. చిత్ర శాంతినికేతన్‌కు ప్రిన్సిపాల్‌గా నియమింపబడ్డారని చదివాం. వి. ఆర్. చిత్ర అంటే మన "చందమామ"లో చిత్ర విచిత్రములైన చిత్రాలను చిత్రించు మన చిత్రాగారేనా?

కాదు. మన చిత్రాగారి అసలు పేరు టి. వి. రాఘవన్.

7. ఎస్. వి. లక్ష్మి, కడప

అన్నయ్యా, ప్రస్తుతం "చందమామ"లో ప్రచురించే రామాయణంలో మైరావణుని గూర్చి కూడా వేస్తారా?

వెయ్యము. మైరావణుడి కథ పురాణాలలోది కాదు, పుక్కిటి పురాణానికి చెందినది.

8 కె. శివరామకృష్ణారావు, గుడివాడ

ఏమండీ, కొన్ని మైళ్ళు పైకి వెళ్ళి కిందకు చూస్తే భూమి గుండ్రంగా ఉన్నట్టు కనిపిస్తుందట, నిజమేనా?

నిజమే. రష్యను అంతరిక్ష నావికులు తీసిన భూమి ఫొటోలు పత్రికలలో వచ్చాయి చూడలేదా? అంతదాకా దేనికి చంద్రగ్రహణ మప్పుడు భూమి నీడ చంద్రుడి మీదుగా వెళ్ళేటప్పుడు నీడ ఆకారం బట్టి భూమి గుండ్రంగా ఉన్నట్టు ప్రత్యక్షంగా కనిపిస్తుందే!

